ఉ॥ ఆమెను దారసించి చటు ♦ లాగ్నివిధమ్మునఁ జిమ్ము తచ్ఛవి
స్తోమముచేత నోరసిలి ♦ సోలి యడల్గొని పాఱి రప్సర
స్త్వామరబృంద మద్దిగని ♦ హర్షమునొంది తదీయపూ వనిన్
బ్రేముడిఁ జేరి చూచిరి వ♦రేణ్యుల నమ్ముని నమ్మునీట్సతిన్. 424

చ॥ కని మునిసేయు నత్తపసు ♦ కన్న మునీంద్రునిఁ గాంచి సేయు పూ
జనము ఘనమ్ముగా నరసి ♦ చాలఁగ వారల సన్నుతించి చ
య్యన దివికేగి రందొఱు వి♦యద్ధునియున్ హరుఁడున్ మనంబులన్
మునిమిథునేప్సితంబులను ♦ బొందుగఁ గూర్పఁదలంచియుండఁగాన్. 425

క॥ మునియుగతపములు మొదలా, దినమున కేఁబదియునాల్గు ♦ దీరెను సమలం
తనునేని వృష్టియొనరదు, ముని యుగ్మమొనర్చుచుండెఁ ♦ బూన్కి తపములన్.

ఉ॥ అంతనె యతిప్రవాని తన ♦ ధ్యానము డించి పురంధ్రితోడ న
త్యంతము దప్పి పుట్టెను ర ♦ యమ్మునఁ బెమ్ముదకమ్ము నాన్ మునీ
ట్కాంత కమండలంబుఁ గొని ♦ కాన జలంబునుగాన కాత్మలోఁ
జింతిలె నేమిసేతు? నెటఁ♦ జేయుదుఁ? గాంతుని దప్పిఁ దీర్పఁగాన్. 427

— * గంగాదేవి స్త్రీరూపముతో ననసూయకు దర్శనమిచ్చుట * —

ఉ॥ లేదుదకం బొకంట నని ♦ లేమ మనం బరియాడుచుండెఁ గా
లూదక యందు నందుఁ గను♦చుండఁగ స్వర్ణది యొక్క నాతి [illegible]
యాద్భుతి నమ్మునీశ్వరుసి ♦ యంగన వెన్కొని పల్కె సాధ్వి! నీ
కేది ప్రియంబు సెప్పు మది ♦ యిచ్చెద వచ్చితి మెచ్చి నిన్నిటుల్. 428

క॥ నీ సెలవున్ గడుఁ గూరిమిఁ, జేసెదఁ జెప్పుమమ్మ! యిట్లు ♦ శివసేవనమున్
నీ సామి సేవనంబును, వాసిగ నొనరించినట్టి ♦ పావన సెలమిన్, 429

క॥ అనుడు మునిసతియు వెనుకకుఁ, గని యాపెన్ బలికె ♦ కమలనయన! యెం
దుననుండి వచ్చితివి? నీ, ఘనత నెఱింగియును [illegible] సనిసన్. 430

ఉ॥ గంగను నేను గొల్చుటకు ♦ గన్గొను నన్ను ము[illegible]పత్ని [illegible]
ష్టాంగముగాఁగ మ్రొక్కె జల ♦ మ[illegible]ఁ గన్న[illegible]మున్
బొంగుగఁ గూర్చినాఁ దపసి♦బోటి యటుల్ పొసఁగించె గంగ యు
ప్పొంగుచు నింపెఁ దత్క్షణమె ♦ పుణ్యజలంబుల గ[illegible]మున్. 431

గీ॥ అప్పుడు జలము గమండల♦మందునింపి, కొనియు నాథప్రభునికి మ్రొక్కె♦యనియెనిట్లు
తల్లి! నా పతి వచ్చు నీ♦వండ కిప్పు, డుంతి[illegible]పు గ్నపసిటు ♦ నాగనలయు.

క॥ అన వల్లె యన నాపెయుఁ, జని సలిలము మాసికొసగ ♦ సత్వరమున న
య్యనఘుఁ డుదకమునుఁ ద్రావి మ, దిని నలరి జలంబు లెందుఁ♦ దెచ్చితి వబలా!

చ॥ ఎపుడెపు డీవొసంగు జల ♦ మిట్టిది కా దమృతోపమానమై
తపనముసేయు నాహృదయ ♦ దారుణపీడ హరించె నిద్దియా
విపినమునందు దుర్లభము ♦ వేయునుడుల్ పనియేమి నీవికన్
జెపుమెటనుండి తెచ్చితివొ ♦ చెల్వరో! యిమ్మధురోదకంబులన్.　　434

చ॥ అనియడుగంగ నాపె హృద♦యంబునఁ దర్కముచేసె వాస్తవం
బును దెలుపంగ నాకడిమి ♦ పొల్పనుదెల్పిన యట్టులౌను గ
ల్లను నడువంగ నయ్యది ద♦లంపఁగరాని యఘంబగుగ్ గటా!
యొనరఁగ జీవితేశ్వరున ♦ కొప్పఁగ నెట్లు వచింతునీయెడన్.　　435

క॥ అని యనసూయాసతి నె, మ్మనమున యోజించి తమదు ♦ మహిమమువలనన్
ఘనమగు శివకృపవలనన్, మనవనమునఁజేరె గాంగ♦మధురోదకముల్.　　436

గీ॥ అనిన నత్రియు నేగాంతు♦నను ముమురిసి, రాఁపదీయప్రియయుఁ గర్త♦రాజనికట
మునకు నేతేరఁగనుపట్టెఁ♦బూర్ణసలిల, రుచిరమై చెలువొందు స♦రోవరంబు.　　437

వ. కన్గొని బిగాన యం దత్రిముని ప్రీతుండై స్నాతుండై నిత్యకర్మంబు లొనర్చి కొనియె ననసూయయు నవగాహనంబుచేసె నంతఁ బరమేశ్వరుండును స్వర్ధునియు దర్శనంబిచ్చి యత్రిమునిని ననసూయను బ్రశంసించి వరంబులిచ్చెద మడుగుఁడనిన ననసూయ గంగ కిట్లనియె.

—* అనసూయ గంగ నెల్లప్పు డట వసింపు మనుట *—

క॥ తల్లీ! యీ తాపసవని, నెల్లప్పుడు మఱచిపాయ ♦ కీవుండవలెన్
జల్లఁగ నాయెడఁగల కృప, ఫుల్లాంబుజనయన! భువన ♦ ములు పొలుపొందన్.

క॥ లోకోపకారమును నగు, వీఁకన్ గరుణాతిశయము ♦ వెల్లివిరియఁగా
నీ కమనీయోదకముల, నీకానన్ సతము నిలిపి ♦ తేని మహాత్మా!　　440

చ॥ మునిసతి యిట్లుగోర నల ♦ ముగ్ధశశాంకధరేష్టపత్ని స్వ
ర్ధుని యిటువల్కె నగ్రము హ ♦ రున్ భజియించిన పుణ్యమిమ్ము నీ
వనినయటుల్ పొనర్చెద మ ♦ హాత్మ! పతివ్రత! యీపతివ్రతం
బున కెనరావు యోగములుఁ ♦ బుణ్యములున్ దపముల్ జగంబునన్.　　441

క॥ నీబోఁటి పతివ్రతచే, నాబోటులు శుద్ధిగాంత్రి ♦ నా మునిసతి గా
రాబొప్ప నొక్కయేఁటను, దాఁబడయు శివార్చఫలముఁ ♦ దడయకయిచ్చెన్

వ. దేవధునియు ననసూయ గోరినయ ట్లాపుష్కరిణియందుఁ బుష్కరరూపంబున సాన్నిధ్యంబు చేసియుండె నంత ననసూయాత్రులు మహేశ్వరు నిట్లుప్రార్థించిరి.

క॥ మందాకిని యెట్టుల మా, యం దాదరమెసఁగ నిందు ♦ నమృతమయంబై
పొందికఁజేరి వసించెనొ, యిందుధరా! యట్టులరసి ♦ యీవుండు మిటన్.　　444

క॥ అని యడుగ శివుఁ డటులెయని, యనసూయారచితలింగ ♦ మందుఁ బ్రవేశం
బొనరించి జగము లేలెను, జను లత్రీశుఁడని పుడమిఁ ♦ జాటి యలరఁగా. 445

వ. అంత యథాపూర్వంబుగ వనంబంతయు బహుపల్లవపుష్పఫలాడ్యంబై చెలువొందె
నెద్దడిఁబాసిన వలసఁబోయిన ఋషులందఱు మరలఁ దఱలివచ్చి శాంతి హోమం
బులు నెరపి రపుడు ఘనాఘనంబులు సువృష్టి నాపాదించె మునులంద ఱానందం
బునఁ బొదలి రిది యత్రీశ్వరలింగ చరిత్రం బిఁక నంది కేశలింగోదంతంబును వినుం
డని సూతుండు మునులకిట్లనియె 446

—* నందికేశలింగము—బ్రాహ్మణీచరిత్రము *—

క॥ రేవానదికిన్ బడమర, గా నర్తిలుతీరమందు ♦ ఘనతరశోభా
సేవితమగు కర్ణికనా, శ్రీపెలఁయుపురిన్ ద్విజుఁడు నివసించు నొకఁడిలన్. 447

చ॥ అతఁడు తనూజయుగ్మమును ♦ కర్థముఁబంచి యొసంగి యంగసన్
సుతులకు నప్పగించి శివు ♦ చోటగు కాశికి నేగి యం దనా
రతము హరున్ భజించి సుక ♦ రంబుగ నీశ్వరుఁజెందె నూరిలో
నతనిపురంధ్రి యాత్మజుల ♦ నారయుచుండెను గొంతకాలమున్. 448

గీ॥ అంతఁ గొన్నేఁడులకు బాప♦నమ్మ సుతను, జెంది రోజుచు మృతివేళ ♦ సిద్ధమైన
ననువు లుత్క్రమణంబు గా♦కుంటఁజూచి, యగ్రపుత్రుఁడుదరిసి యి♦ట్లనియె వేగ.

ఉ॥ అమ్మరో! నీడు చిత్త మిపు ♦ డక్కట! యేనొ కోఱతఁజెంది యి
ట్లుమ్మలికమ్ముఁజెందు నది ♦ నున్న తెఱంగును చెల్పు నీ యభీ
ష్టమ్మును దీర్తు సత్యమనఁ ♦ జయ్యన నాపె దపస్వినాసిఁ దీర్ఘ
ణ్ణమ్మున గంగఁజేర్చుమని ♦ నందనుఁ డట్లె యొనర్తునంచ నెన్. 450

గీ॥ అంత బ్రాహ్మణి "హరహరా" ♦ యనుచు నసును
విడిచెఁ గొడుకులునున్ విధి ♦ విహితముగను
శవమును దహించి యస్థిసం ♦ చయన మొనరఁ
జేసి కర్మంబులన్నియుఁ ♦ జేసి రపుడు. 451

గీ॥ మాసిక శ్రాద్ధమొనరించి♦యాసువాదుఁ, డ నెనువి ప్రాగ్రసుతుఁడును♦దినమునందుఁ
తల్లిఋణమును దీర్పఁగాఁ♦దలఁచి యుచిత, దానధర్మము లొనరించి♦తగినయట్లు.

క॥ తన భార్యాపుత్రులతో, ననుమతిఁగొని శివుని మనము ♦ నందుఁ దలఁచి యొ
క్కనిఁగూడఁ దోడుకొని గం, గనుగూరిచి తఱలె నస్థి ♦ కాండముతోడన్. 453

క॥ నడిచి యొకయోజనము ధ్యానుఁడు గుర్తింపుచునుండ బ్రాహ్మ♦ణుం డొకపల్లెన్
బొడఁగాంచి చేరి యచ్చోట, విడిసె నొకఁడు పాఱు నింటి ♦ వేదికయందున్.

వ. సంధ్యావందనాదికర్మ్ములను సలిసి సేవకునితోడఁ బవళింపుడు నప్పుడం ద్వాకవింత జరిగె నద్దానిఁ జెప్పెద వినుండు. 455

## —* ధేనువు సాహసకృత్యము *—

ఉ॥ ఆ యెడలన్ వసించెడి ధ♦రామరుఁ డొండొకయూరి కేగి యా
సాయమునందె వేగ నిజ♦సద్మముఁ జేరఁగవచ్చి యావుపా
లాయెడఁ బిండఁగోరి తన♦యాలినిఁ బిల్చి ఘటంబుఁదెమ్మనా
నా యెలనాగ యిచ్చుడు ర♦యంబునఁ గ్రేపును బాపి లాఁగఁగాన్.

చ॥ అదియునుబోక బ్రాహ్మణుని♦యంఘ్రినిఁ ద్రొక్కఁగ నొప్పిఁజెంది య
ప్పదమున నాతఁ డాగ్రహముఁ♦బట్టి కడున్వడి దానిఁగొట్టె న
మ్మొద వది గాంచి యశ్రుకణ♦మోచనమున్ బొనరించె దుగ్ధముల్
బిదికి ద్విజుండు లోనికిఁ జ♦నెన్ వృషపోతము మాత కిట్లనెన్. 457

ఉ॥ ఏటికిఁ దల్లి! యశ్రువుల♦నెంతయు రాల్చితి వింతవంత నీ
కేటికి దాపరించె నన♦నింతకు నెక్కుడిఁ కేమి గావలెన్
గాటులు సెందఁగా నొడలు♦గాదిలిబిడ్డని బాఁదుచుండ నా
రాటము చెంది కుందదె క♦రంబు భరంబుగఁ జిత్త మాత్మజా! 458

వ. అనిన లేఁగ యిట్లనియె.

క॥ తొలిజన్మంబున మదమున, సలిపినదోసంబు లురక♦చనునే? వానిన్
పొలయకఁ గుడువఁగ వలదే?, తొలఁగునె దోసంబు లెందు♦దూఱిన జననీ! 459

క॥ సుకమును దుఃఖంబును నొం, డొకడొసఁగఁగ లేఁడు కర్మ♦మొసఁగును స్వీయం
బిఁక వగవనేల? సర్వము, స్వకృతఫలంబులని యెఱుఁగఁ♦జను దేహులకున్.

ఆ॥ అనిన సురభి యిట్టు♦లనియెఁ గుమార! నీ, వనినచందమంత♦యును నెఱింగి
యున్నదాననైన♦నుడుగక మోహావ, శంబుఁ జేసి యిట్లు♦జాలిపడితి. 461

ఆ॥ అనుచు మరలఁ గనుల♦నశ్రులు వెలిపుచ్చు, తల్లి కనియె లేఁగ♦తగునె మరల
నెఱిఁగియెఱిఁగి యిట్టు♦లేడ్వఁగా నమ్మరో!, యేమిసేయుదాన♦వేడ్చి యిపుడు.

వ. అనిన ధేనువిట్లనియె.

ఉ॥ నావలె నీ ద్విజన్ముఁడు ఘ♦నంబుగ దుఃఖముఁ జెంది యేడ్వఁగా
నావగ పాయు నంతకుఁ బో♦నర్చునిటుల్ పరితాప మిద్ది నే
నేవగనైన వీనిసుతు♦నెల్లి వధించెద చూఁడునాఁగఁ దా
భావమునందు రోసి వెస♦వత్సము ధేనువుతోడ నిట్లనెన్. 463

చ॥ కనుఁగొని బ్రాహ్మణుండు మదిఁ ♦ గౌతుకమొంది కడిందిభక్తిఁ బా
వనతరతత్తటాంబువుల ♦ వాసిగ మజ్జనమొంది పోవుచుం
టను గని యొక్క దివ్యకుల ♦ నారి ద్విజన్మునితోడ బ్రాహ్మణా!
చనె దెట కీవు? సెప్పు మిఁక ♦ సత్యముదప్పక యన్న నాతఁడున్. 473

వ. తన యుదంతంబు నెఱింగించిన నాదివ్యభామిని నీతల్లియస్థుల నీతీర్థమునం దేయుంపు మద్దాన నీజనని దివ్యదేహంబునొంది శివలోకంబు సేరఁగల దిది వైశాఖ శుద్ధసప్తమీదినం బీవాసరంబందు భాగీరథి యీతీర్థంబందు సాన్నిధ్యంబుసేయు నని చెప్పి యంతర్ధానంబుసేయుటయు ధరామరుం డాపెను గంగాదేవిగా నెఱింగి మరలి తనతల్లియస్థులలోఁ జక్కసగం బత్తీర్థంబందు వేయునంతలో నతనితల్లి దివ్యదేహంబునొంది గగనపథంబందుండియే కొడుకును గాంచియిట్లనియె. 474

చ॥ కొడుక! కృతార్థతన్ బొరసి ♦ కొంటివి ధన్యుఁడనైతి నేను ని
ప్పుడె సురలోకవాసమును ♦ బొందెద నీ కెడలేక సౌఖ్యముల్
దొడరెడుఁ బాడిపంటలును ♦ దొడ్డగ భాగ్యము సేకుఱున్ గడున్
గడు భవదీయవంశ మిలఁ ♦ గాంచును వృద్ధి నఖండరీతిగాన్. 475

గీ॥ ఇట్లు పలుమఱుదీవించి ♦ యింద్రలోక
మరిగి చిరకాల మట సౌఖ్య♦మంది పిదపఁ
బరమశివకృపఁ జెందె ని♦ర్వాణలక్ష్మి
బాపఁ డదిగాంచి విస్మయం ♦ పడి ముదమున. 476

వ. తక్కిన సగమస్థులనుగూడ నాతీర్థంబ దే వేసి సేవకునితోఁ దనపురంబుఁ జేరె ననుడు మునులు మహాత్మా! నందికేశలింగ చరిత్రంబును వైశాఖ శుద్ధసప్తమీతిథియందు మందాకిని యాతీర్థంబుఁ జేరుటకుఁగల కారణంబును జెప్పుమనుడు సూతుం డిట్లనియె. 477

—* ఋషికాచరిత్రము *—

చ॥ ఋషికయనాఁగ నొప్పెడు మ♦హీసురవర్యకుమారియోర్తి బల్
సుషమతనూజ్జ్వలాంగి విధి ♦ చోదన బాల్యవితంతువై కడున్
ఋషికులమెల్ల మెచ్చఁగ స♦మిద్ధతపం బొనరించుచుండెఁ గ
ల్మషహృదయుండు మూషుఁడను ♦ మాంసభుగగ్రణియొక్కఁ డాపెపై. 478

చ॥ వలపును జెంది పంచశర ♦ భల్లవిదారితచిత్తుఁడై వడిన్
జెలువను దారసించి తన ♦ చిత్తముఁ దెల్పి బలాత్కరింప స
త్కులజ శివార్చనాపరయుఁ ♦ గోవిదయై యలరారు నాపె య
క్కలుషు ననాదరింప వెసఁ♦గన్నును మిన్నును గాన కాతఁడున్. 479

ఉ॥ పైకొన నుద్యమింప ద్విజ ♦ బాలవితంతువు దిక్కుమాలి య
ప్పోకిరికిన్ హితోక్తులను ♦ బోధనొనర్చియు లబ్ధిలేమికిన్
లోకశరణ్యు శంకరుని ♦ లోనఁదలంచి తదీయనామగా
నైకమనంబుతో నిటుల ♦ నాయమ నాయమ యంచు భీతినై. 480

ఉ॥ కిన్ంచుదనమ్ముతోడఁ బరి ♦ కించక వీఁడిటు దుర్మదాంధుఁడై
కొంచకశీలభంగమును ♦ గూర్పఁగడంగి పయింబడంగనుం
కించుచు నున్నవాఁడెవరు ♦ గిల్బిషమాఁగుదురిందు నీవె యూ
హించి దయారసంబెద వహించి ♦ ఖలున్ గడతేర్పు మీశ్వరా! 481

—* హరిణగతిరగడ *—

శివ శివ శివ శివ ♦ శివ శివ శంకర!
శివ శివ శివ శివ! ♦ శివమునికింకర!
కవిజననుతపద ♦ కంజసముజ్జ్వల
రవిశశినయన! హి ♦ రణ్యాతిసూజ్జ్వల!
శ్రీకర! దయ నిటు ♦ చిమ్ముము నాపయి
వీఁక నసురఁ బెగ ♦ వేయుము ప్రాపయి
తేఁకువఁ గొనుమీ ♦ దివ్యచిత్తమున
నీ కెవ రెదురు త్రి ♦ నేత్ర! మొత్తమున
నీ పదంబులకు ♦ నెక్కొని మ్రొక్కెద
నాపదఁ బాపిన ♦ నభవా! దక్కెద
వాద మేల? పెఱ ♦ వానికిఁ జిక్కదు
మీఁదటఁ గనుఁగొన ♦ మిత్తికి దక్కదు
తలకొనఁబాల న ♦ ధర్మము దేవర!
యలవుఁజేసితి కృ ♦ పాకర! ప్రోవర
శంకర శంభో! ♦ శరణుఁ జేసెదను
పంకజారిధర! ♦ పదము డాసెదను
సంకటహర! నిను ♦ సారెసఁ దలఁచెద
హుంకృతివిధి నీ ♦ యడుగులఁ గొలిచెద
పంకిలకర్మము ♦ బాయఁగఁ జేయుము
పంకలఁబోవక ♦ సవ్యము డాయుము
కావఁగ రావే ♦ కమనీయమూర్తీ!
ప్రోవఁగ నీవే ♦ పూరితకీర్తీ!
నానేరమునిఁ గ ♦ సంవగ జిత్తతి

నీనెఱేఁ దప్పిన ♦ నీల్గును బిత్తరి
తల్లివి నీవే ♦ తండ్రివి నీవే
యెల్లలోకముల ♦ కేలిక వీవే
ముల్లోకములకు ♦ మూలం బీవే
చల్లగఁ బ్రజలను ♦ సాకెదు వీవే
తోడువునీవే ♦ దొరవును నీవే
నీడవునీవే ♦ నెయ్యుఁడ వీవే
నీవే త్రాతవు ♦ నీవే నేతవు
నీవే దాతవు ♦ నీవె విధాతవు
భర్తరాల నీ ♦ పాలఁబడితి నిఁక
శక్తిపతీ! వే ♦ సాఁకుము గొంకక
యొప్పరికించిన ♦ నొప్పునె నీకది
తప్పదు నీకిఁకఁ ♦ దారసింప కిది
రమ్మిఁక రమ్మిఁక ♦ రాజభూషణుఁడ!
నమ్మితి ని న్నా ♦ మ్నాయభాషణుఁడ!
గౌరీకాంతుఁడ! ♦ కలుషవిదారుఁడ!
శ్రీరమణాదిక ♦ చిత్తవిహారుఁడ!

—* శివుఁడు రక్కసునిఁ జంపి ఋషికకు వరంబు లిచ్చుట *—

గీ॥ ఆర్తితో నిట్లు వేడఁగ ♦ హరుఁడు వేగ, భక్తరక్షణదాక్షిణ్య ♦ భంగులలర
వచ్చియసురనువీక్షింప ♦ భస్మరాశి, యయ్యెఁ బలరాశి దత్క్షణం♦బందెయచట.

వ. అంత శివుండు ఋషికన్‌గాంచి.

క॥ కోరినవరముల నిచ్చెద, నీరజదళనేత్రి! సుకృత♦నిశితచరిత్రి!
ధీరమతి! యడుగుమన నెదఁ, దేఱి ప్రణుతి నిరతమతినిఁ ♦ దెలిప యిటులనెన్.

క॥ బ్రదికించినాఁడ వీశ్వర!, సదయహృదయ! దేవదేవ! ♦ శరణావనసం
పదుదార! దీనబంధూ!, మదమెత్తిన యసురఁ గడపి ♦ మాన్పితి వార్తిన్. 485

సీ॥ ఆయెఁగా తెరపి మే♦లాయెగా సుఖముపెం, పాయెగా పోయెఁగా♦డాయువనట
ఊడెఁగా మదముపె♦న్నాడెగా దృశము పో,నాడెగా యుసురు దై ♦త్యాధముండు
పాసెఁగా బాధలో♦డాసెగా బోధవే, మాసెఁగా వెఱపువి♦శ్వాసమెసఁగ
మించెఁగా కోర్కెగు♦చించెగా భక్తిపేర్మి, మించెగా హృదయము ♦ దంచితముగ.

గీ॥ నిండెఁగాఁగీర్తి యెల్లెడఁ ♦ బండెఁగామ, దీయపూజనమిది పార్వ♦తీసహాయ!
పొదలెఁగా బెదరఖిల దు♦ర్వ్యాధులకెంతో, సకలలోకైకరక్షణ♦ చతుర! యిపుడు.

చ॥ ఇఁకను వరంబు లేటికి మ♦హేశ్వర! మైనను నీదు పాదసే
వకమతి నాకొసంగు మన♦పాయముగాఁగ జగంబులేల ను
త్సుకత వసింపు మిందనుడుఁ ♦ దోడనె యీశ్వరుఁడుక్ దయామయా
త్మకుఁడయి లింగరూపమునఁ ♦ దా వసియించె వనస్థలంబునన్. 487

వ. అఖిలజనానందకరంబగుట నాలింగంబు నందికేశలింగంబని పేరొందె నంతగంగా
దేవియునుక్ దాగసించి యమ్మౌనిని కిట్లనియె. 488

క॥ అమ్మరో! తావకసుచరిత్రమ్మునకే నెంతయుక్ ముదంబునడితి వ
ర్షమ్మున నొకతడవ త్వదీ,యమ్మగు మజ్జనమునొప్ప♦నప్పలనుందుక్. 489

వ. ఈనాఁడు వైశాఖశుక్ల సప్తమి యగుట నేఁటట నీదినంబందీ తీర్థంబునందుఁబ్రవే
శించి యమ్మౌనినాఁడు చనుదునని యంతర్ధానంబుఁజెందె నిట్లు నందికేశలింగో
త్పత్తియును నర్మదాతీర్థంబునందు గంగాప్రాప్తియును మీకెఱింగించితి నిఁక
హరీశ్వరలింగచరిత్రంబు నెఱింగింతు వినుండని సూతుండు మునులకిట్లనియె.

—* హ రీ శ్వ ర లి ం గ ము *—

ఉ॥ సర్వజగంబులేలు నల♦శౌరి నిశాచరమండలిక్ నిజా
ఖర్వపరాక్రమోగ్రత ని♦కామలయం బొనరించుచుండినన్
గర్వముతోడ వారు సుర♦కాండముఁబట్టి పలార్చుచుండఁగా
నోర్వఁగలేక లేఖులు ర♦యోన్నతి వెన్నునిఁజేరి యార్తులై. 490

క॥ తమగోడు విన్నవించి ర,యమునన్ రక్కసులపీఁచ♦మడఁచి జగములన్
మముసాఁకుమనుచు వేఁడుడుఁ, గమలాకాంతుండు వెరవు♦గాంచకకించక్.

ఉ॥ ఎందఱిఁబట్టి చంపిన ర♦ణేష్యులు రాక్షసనస్యు లేచి యీ
చందము వేల్పులక్ గలఁచి ♦ సర్వజగంబుల కార్తిసేయుచున్
ముందుకు వచ్చుచుండిరి య♦మోఘతరంబగు నాయుధంబు లే
కిందఱి నెట్టు లాజి సమ♦యింతు గడింతు జయాతతోన్నతుల్. 492

క॥ అని మదిఁదలపోసి వెసక్, జనికైలాసాద్రిఁజేరి ♦ శంకరు నెదలోఁ
గొని పార్థివలింగమునకుఁ, గనకాబ్జసహస్రపూజఁ ♦ గావింప నొగిక్. 493

మ॥ ఒకనాఁ డీశ్వరుమాయఁజేసి హరి దా ♦ నుగ్రార్చ్యయందున్న వే
శకు నంభోజమొకండు దక్కువగుడున్ ♦ లక్ష్మీశ్వరుం డీ జగ
న్నికరబంతయు దివ్యదృష్టిఁగని య ♦ న్నీరేజరాజంబుఁ గా
నక యాశ్చర్యభయంబులొంది పెలుచన్ ♦ ధైర్యంబుతో నంతనే. 494

## -*విష్ణుమూర్తి శివలింగమునకు నేత్రకమలంబర్పింప శివుఁడు చక్రమిచ్చుట*-

క॥ సునిశితములైన గోళ్ళఁ, దన నయనాబ్జంబు వ్రచ్చి ♦ దండధరహరా
ర్చనసల్పుడు హరుఁడు ముదం,బునవచ్చి యభీష్టమడుగు♦ము హరి! యనంగన్.

మ॥ జలజాక్షుండు శివున్ గనుంగొని కడున్ ♦ సంతోసమున్ జెంది వే
ల్పులదుఃఖంబులు క్రవ్యభుక్కుల యఘం♦బుల్ దెల్పి యల్పాయుధం
బుల నద్దైత్యులఁ దీర్పరామికిఁ గృపాం♦భోధీ! జగద్రక్షకై
బలవంతంబగు నాయుధంబు నిడుమా! ♦ ప్రార్థింతు నెంతేనియున్. 496

*క॥ అన దేవదేవుఁ డెంతయు, నినకోటిప్రభము మహద♦హితపరి పటలీ
హననచణంబైన సుద, ర్శనమను దివ్యాయుధము నొ♦సంగి యిటులనెన్. 497

ఉ॥ ఎందఱి మీఁదవేసిన ర♦మేశ్వర! మీఱి క్షణంబులోన నా
యందఱిఁద్రుంచి తావకక ♦ రాగ్రమునందుఁ బ్రవేశమొందు ము
ప్పొందఁగనీక నీకు ముద ♦ మొందఁగఁజేయు ధరింపు మింక నీ
కుండెడబాయు లోకముల ♦ కున్ సుఖమున్ బొనరింపు దీనిచే. 498

క॥ మఱియును వరంబు లిచ్చెద, సరసీరుహనయన! యడుగు ♦ జంకక యన నా
హరి మురిసి మ్రొక్కి యడిగెను, బరమేశ్వర! నీదు పాద♦భక్తినిడు మొగిన్.

వ. మెండియు మత్సమర్చితంబగు నీ పార్థివలింగంబందు నిచ్చలు సాన్నిధ్యంబునెరపుమని యర్థించిన శంకరుఁడు తథాస్తని యట్లొనర్చి యంతర్ధానంబునొందె నంత మాధవుం డలరి చని దుష్టదైత్యసంహారం బొనరించి లోకరక్షణం బొనర్చుచుండె నిది హరీశ్వరలింగచరిత్రం బిఁక గోకర్ణేశ్వర చరిత్రంబుఁ జెప్పెద నాకర్ణింపుఁడని సూతుండు మునుల కిట్లనియె.

## —* మహాబలేశ్వరలింగము - గోకర్ణము *—

క॥ గోకర్ణస్థలమహిమము, గోకర్ణేశ్వరమహిమము ♦ గొనకొని నుడువన్
గోకర్ణగ్రవేయుఁడు, గాక యొరులు వలఁతు లవనిఁ ♦ గలరె మునీంద్రుల్!

క॥ శివలింగకోటు లచ్చట, భవభంజకతీర్థకోటి ♦ పాతకకోటిన్
దవుదవ్వుల నవియించును, శివసాక్షాత్కారసిద్ధి ♦ సేకుఱఁజేయున్. 501

వ. అందు

---

* శివపురాణే కోటిరుద్రసంహితాయాం షట్త్రింశదధ్యాయే—

శ్లో॥ ఏవముక్త్వా దదౌచక్రం । సూర్యాయుత సమప్రభం । సుదర్శనం స్వపాదోత్థం । సర్వశత్రు వినాశనం ॥ విష్ణుశ్చాపి సుసంస్కృత్య । జగాద్రహోదజ్ముఖస్తదా నమస్కృత్య మహాదేవ, మిత్థం వచన మబ్రవీత్ ॥

చ॥ కమలజవిష్ణుముఖ్యసుర ♦ కాండహితార్థముగాఁగ రాక్షసో
త్తముఁడగు పజ్క్తికంఠుని యు♦దాత్తతపఃఫలమై గణేశదోః
కమలయుగప్రతిష్ఠ నొగిఁ ♦ గాంచినయట్టి మహాబలేశలిం
గము సకలాఘపుంజములఁ ♦ గ్రచ్చఱఁ బాయఁగఁజేయు రూఢిగన్. 502

క॥ ఆపాతాళభువనముల, నేపొప్పఁగ నాక్రమించి ♦ యెలరుటచేఁ దా
నోపె మహాబలుఁడను ప్రథ, కాపరమేశానలింగ ♦ మచ్చోట సిరిన్. 503

గీ॥ కృతయుగంబునసితము లో♦హితము త్రేత, ద్వాపరంబునఁబీతమం♦త్యయుగమందు
శ్యామలంబయిరాజిలు ♦ నామహాబ, లేశలింగము వినుఁడు ము♦నీశులార! 504

శా॥ శ్రీనాథుండు విరించి వాసవుఁడు వి ♦ శ్వేదేవులున్ దస్రులున్
భానుద్వాదశకంబునున్ వసువులున్ ♦ బంకేరుహారాతి పా
నానక్షత్రములున్ మరుత్తులు విమా ♦ నస్థాయులై నిత్యమ
న్యూనప్రీతినిఁ బూర్వగోపురమునన్ ♦ యోజింతురు ధ్యానంబులన్. 505

గీ॥ అమరి రుద్రగణంబులు ♦ జముఁడు మిత్తి, చిత్రగుప్తుఁడు పితరులు ♦ జిత్రభానుఁ
డల్లె దక్షిణగోపుర ♦ మాశ్రయించి, భజన మొనరించుచుందురు ♦ భక్తిమీఱ.

క॥ వరుణుండు సరిత్పతియును, సరిదగ్రణులల్ల జహ్ను ♦ జాప్రభృతులు శం
కరు నిచ్చలుఁ గొలుచుచు నుం,దురు పశ్చిమగోపురమునఁ ♦ దోరపునిష్ఠన్.

గీ॥ వాయుదేవుఁడు ధనపతి♦భద్రకాలి, చండికయు మున్నుగల్గుప్ర ♦ శస్తమాతృ
కలు నుదగ్ద్వారమందొప్పి♦కడిఁదిభక్తిఁ, గొల్తురు మహాబలేశ్వరుఁ ♦ గూర్మిపేర్మి.

క॥ గరుడులు గంధర్వులు కిన్నరులును గుహ్యకులు చార♦ణప్రముఖులు కిం
పురుషులు సిద్ధులు విద్యా,ధరులు మహాబలునిఁ గొల్చె♦దరు సతమర్థిన్. 509

క॥ భేతాళులు ప్రేతంబులు, భూతంబులు భీతిజనక ♦ భూరిబలలస
ద్దైతేయులు శేషప్రము, ఖాతతఫణివరులు గొలుతు♦రా హరునెప్పుడున్. 510

చ॥ కొలిచినవారి కెల్లరకుఁ ♦ గొంగున బంగర మా మహేశ్వరుం
డలఘుత రేప్సితార్థముల ♦ నారసి యైహికపారమార్థికం
బుల నిడుచుండు నందుఁ దప♦ముల్ పొనరింతురు పల్వు రమ్మహా
బలశివలింగమున్ గుఱిచి ♦ పల్కుదురార్యులు మోక్షదాతఁగాన్. 511

గీ॥ మాఘకృష్ణచతుర్దశీ ♦ మహితపర్వ, మున మహాబలపూజన ♦ మున సమస్త
పాపులెల్లరు మోక్షంబుఁ♦బడయుదురు ది,దృక్షనేతెంతు రఖిలది♦గ్దేశజనులు.

క॥ స్త్రీలుం బురుషులు వృద్ధులు, బాలురును వితంతువులును♦ బన్యాస్త్రీలున్
నాలుగు వర్ణంబులవా, ర్జాలఁగ శివరాత్రి కటకు ♦ సాఁగెద రెలమిన్. 513

గీ॥ వచ్చి దేవేశువీక్షించి♦వైభవమునఁ, గొలిచి కృతకృత్యతన్ గాంతు ♦ రెలమి కలిమి
నొక్క చండాలి శివలోక♦ మొందె శర్వ, రాత్రి శివపూజ యొనరించి♦ ప్రాణగదుర.

వ. అనిన సూతునకు మహాత్మా! చండాలి యెట్లు శివపూజనొనర్చి శివలోకంబున కేగెనో, అయ్యితిహాసం బానుపూర్విగ నెఱిఁగింపుమని మునులనుటయు సూతుం డిట్లనియె. 515

## —* సోమినీ చరిత్రము *—

క॥ చండాలి పూర్వమం దొక, దండిద్విజన్మాగ్రణికి సు♦తయయి పొడమె నా
తండును సోమిని యని మేల్, నిండారఁగఁ బేరుపెట్టి ♦ నేటుఁగఁ బెంచెన్.

గీ॥ యుక్తవయసొందియున్న న♦య్యువిద కర్హుఁ, డైన వరుదెచ్చి తగ వివా♦హంబు నెరపి
విభుని యింటికిఁ బంప న♦వ్వెలఁది మగని, తోడ నిష్టసుఖంబు లొం♦దుచు వసించె.

గీ॥ అంతఁ గొన్ని దినంబుల ♦ కాపె పూర్వ,కర్మవశమునఁ జేసి మ♦గండు రుజను
దనరి మృతిఁ జెందెనాపె వై♦ధవ్యమొందెఁ, బడుచుఁదనమున సెల్లరుఁ♦ బాపమనఁగ.

క॥ కొన్నాళ్ళవఱకు సోమిని, యున్న తెఱఁగు గానరాక ♦ యున్నతమతితోఁ
బున్నెపుఁద్రోవనె మెలఁగెను, మిన్నగ బందుగులుఁ బెఱలు♦ మెచ్చఁగఁ దన్నున్.

వ. అంతఁ గొన్ని దినంబులకు.

క॥ నిగనిగలాడెడు మేనును, నగులేమొగమును బ్రితిక్ష♦ణము పెరుఁగు పసం
దగు గుబ్బదోయి పిఱుఁదును, దగు సోమినిఁ గని మరునకుఁ ♦ దలఁకరి యువకుల్.

వ. అంతనాపెయు.

గీ॥ చక్కఁదనమొప్పనొడలు సొం♦పెక్కు లేఁత, ప్రాయమును జెంది మన్మథ♦భల్లములకు
మదినిఁ గాపాడఁజాలక♦ బెదరి సరసఁ, జేరు యువకులతోఁ బొందు ♦ చేసె నంత.

క॥ చాటుగఁ గొన్నాళ్ళిటు విట,కూటముతో సురతగోష్ఠిఁ♦గూడుచుఁ దమిమై
బోటి చరింపుచునుండఁగఁ, దేటపడియె నందఱకును ♦ దెఱవ తెఱఁగొగిన్. 522

వ. అంత.

చ॥ కులజను లెల్లఁ గూడుకొని ♦ కూడని తెర్వునఁ జేరె యిట్లు ని
ర్మలమగు నన్వయంబునకు ♦ మచ్చ పొసంగఁగఁ జేసి తోసి! వృం
శ్చలి! మదమెక్కి యుంటివిఁక ♦ మాకును నీకును బొత్తుగాదు నీ
వలసిన చోటికేగుము జ♦వంబుననంచు మహాగ్రహంబునన్. 523

ఆ॥ కొప్పుఁబట్టి యీడ్చి♦కొనిపోయి యూరికి, దవ్వుగాఁగ విపిన♦తలముఁ జేర్చి
యంద విడిచి వచ్చి♦రా బ్రహ్మకులజులు, పొలఁతి యచట దెసలఁ ♦ గలియఁజూడ.

సిరిపట్టునో యారయుండిట్లు మహాబలేశ్వరలింగ మాహాత్మ్యంబు దెల్పితి నింకను నద్భుతంబగు తద్విభూతి నే వక్కాణించెదనని సూతుం డిట్లనియె. 542

## —* మిత్రసహోపాఖ్యానము *—

క॥ శ్రీకాంతావాసంబగు, సాకేతపురంబు మిత్ర ♦ సహుఁడను నృపుఁ డి
క్ష్వాకుకులోద్భవుఁ డేలు న, లోకపరాక్రముఁడు శూర ♦ లోకస్తుతుఁడై. 543

క॥ నలునకు దమయంతి యటుల్, వెలసెను మదయంతి నృపతి ♦ వీరుని సతియై
లలితగుణరత్ననిధియై, విలసితధర్మిష్ఠయై వి ♦ వేకవతియునై. 544

గీ॥ ఆనృపుండొక్కపరి మృగ ♦ యార్థ మటవిఁ, జేరి విహరించుచుండి దు♦శ్శీలు సాధు
దుఃఖకరు నొక్కరక్కసుఁ♦దొడరి చంపె, నంత నవ్వానిసోదరుం ♦ డలుకఁ బెంచి.

క॥ మోసంబును బన్ని యనా, యాసంబున నరికి దుఃఖ ♦ మర్పించుటయే
వాసి యని యెఱిఁగి వినతుం, డై సేరుడు తేఁడు సూచి ♦ యాదర మొప్పన్.

గీ॥ తనకు వాని మహానసా♦ధ్యక్షునిగ నొ, నర్చి యవ్వానిఁ గొన్నిది♦నంబు లుండి
తిరిగి దనరాజధాని కే ♦ తెంచుటయును, బైతృకము దారసించినఁ ♦ బరమభక్తి.

చ॥ అనఘుని నవ్వసిష్ఠముని ♦ నన్వయదేశికునిన్ నిమంత్రితుల్
బొనరిచి శ్రాద్ధముల్ సలుపఁ♦బూన నరామిష మొక్క శాకమం
దనువుగఁగూర్చి వండి మను♦జాదుఁడు వడ్డనచేసి తాఁ దొలం
గెను ముని దాని చొప్పరసి ♦ కిన్క సహింపక జేని కిట్లనెన్. 548

క॥ మనుజాశనుబలె నీవీ, మనుజక్రవ్యంబుఁదెచ్చి ♦ మాకర్పింపన్
జనునే నీవిటు వేగమె, మనుజాశనుఁడ వగుమింక ♦ మదము దిగంగన్. 549

చ॥ అని శపియించి యద్ది మను♦జాధిపకృత్యముగాక లాఁతియా
దనుజునికృత్యమం చెఱిఁగి ♦ దారుణశాపము ద్వాద శాబ్దముల్
దనుక సహింపఁజెల్లు నవ♦లన్ మరలన్ నరపాలమూర్తివౌ
దనె నృపుఁడెల్ల నారసి జ♦లాంజలిఁబూని గురున్ శపింపఁగా. 550

చ॥ నిలిచిననంతఁ దద్రమణి ♦ నీరజనేత్ర కడున్ భయంబుతో
వలదు మహాత్మ! నీగురుని ♦ వంచనసేయఁగ నొప్పమంచు నం
ఘ్రులఁబడి వేడ నామెనుడిఁ ♦ గూర్చినప్రేమిడి నల్కఁబాసి త
జ్జలముల నాత్మపాదములఁ ♦ జల్లికొనెన్ గడు ధీరచిత్తుఁడై. 551

## —* మిత్రసహుఁడు కల్మాషపాదుం డగుట *—

క॥ పదములు గల్మషమొందిన, సదయుఁడు గల్మాషపాద♦సంజ్ఞన్ బడసెన్
బదపడి గురుశాపంబున, నదరిపడుచు ఘోరదనుజుఁ♦డై పురిఁ బాసెన్. 552

చ॥ అడవికిఁ జేరఁబోయి గవ♦యంబుల నేన్గుల లొట్టిపిట్టలన్
గడిఁదివృకంబులన్ బులుల ♦ ఖడ్గమృగంబులఁ జెండి మెక్కుచున్
గడువడి మ్రాకులెక్కుచు వి♦కారముగాఁ బరుగెత్తుచున్ వడిన్
మిడిమిడిచూపులన్ గనుచు ♦ మిత్తివలెన్ జరియించుచుండఁగా. 558

వ. ఒక్కనాఁడు.

క॥ ఒకచో లేఁబ్రాయపుఁదమి, మకరాంకక్రీడఁబెనఁగు ♦ మానికులకుమా
రకమిథునముఁ బొడఁగని యం, తకసన్నిభుఁ డాపలాశ♦నప్రముఖుఁడొగిన్.

గీ॥ మృగకిశోరంబుఁ బులివట్టి♦మెసవుపోల్కి, సతికవుంగిట నొదిగిన♦సన్మునిసుతు
నొడిసి తినఁబూన నసురకు♦నడలి మాని, సతియిటులు ప్రార్థననొనర్చె♦సత్వరముగ.

చ॥ వలదు మహాత్మ! నావిభుని ♦ బాల్యవయస్కుని సాధువృత్తునిన్
బొలియఁగఁజేయ కిష్టతినఁ♦బూనునెడన్ ననుఁ జంపి మెక్కు మం
జలి యొనరించెదన్ విడుము ♦ చక్కఁగ నావిభు నన్న నాతఁడున్
దలఁకక చంపి మెక్కెఁ జనెఁ ♦ దన్విఁ గడున్ విలపింప నార్తయై. 556

ఆ॥ అంత మానికాంత♦యప్పులాదునిఁజూచి, నీవు నారిఁజేరి ♦ భావజన్మ
కేళిఁదేలునెడలఁ♦గాలంబుఁజెందుదు, వనుచు శాపమిచ్చి ♦ యతిరయమున.

గీ॥ మగనియస్థుల నెత్తి యం♦మ్మగువ చితినిఁ, గూర్చియగ్నిఁబ్రవేశించెఁ♦గుందుమాని
అంత నసురకు శాపాంత♦మగుడు మగుడ, నాత్మరూపంబు ప్రాపింప♦నరిగెఁ బురికి.

ఉ॥ అందు సమస్తనాగరమ♦హాజను లా నృపచంద్రుఁజూచి యా
నందముఁజెంది యుత్సవ మొ♦నర్చిరి రాజవరుండుఁ బేర్మిమై
నందఱి గారవించె నిశి♦యందు రతిప్రియుఁడై నిజాంగనా
మందిర మొంద నాపె ముని♦మానినిశాపముఁ దెల్పి కుందుచున్. 559

## —* మదయంతి భర్తకు మునిసతీశాపంబుఁ దెల్పుట *—

క॥ తా వైధవ్యభయంబున, భూవిభు వారించె నతఁడు ♦ పోగిలి కడువగన్
దా వైరాగ్యముఁజెంది మ, హావిపినస్థలినిఁజేరి ♦ యందే యుండెన్. 560

క॥ మునిసుతుఁ జంపిన యందలి, ఘనదురితబ్రహ్మహత్య ♦ గడలికొని నృపున్
వెనుకొని వేధింపఁగఁజొ, చ్చిన నృపవరుఁ డెంతయేనిఁ♦జింతిలె మదిలోన్.

మ॥ పలుతీర్థంబులఁ గ్రుంకె నెంతయును దీ♦వ్యన్మంత్రయోగంబులన్
సలిపెన్ బెక్కువ్రతంబులన్ మఖములన్ ♦ సమ్యగ్విధానంబు శో
భిలఁగూర్చెన్ మునిహత్య యించుకయునున్ ♦ బీఱ్వోక బాధింపఁగాఁ
దలఁకున్ జెంది యయోధ్యఁజేరె మరలన్ ♦ ధాత్రీశ్వరుం డార్తుఁడై, 562

క॥ అందును బాహ్యోద్యానము, నందు వసతిఁ జేసియుండ ♦ నచ్చోటికి మౌ
నీంద్రుఁడు గౌతముఁ డతులా, నందుఁడు చనుదేఱ మనుజ♦నాథుఁడు పేర్మిన్.

క॥ కని యర్ఘ్యాది సపర్యను, బొనరిచి నతిచేసియున్న ♦ భూభుజుఁ గని య
మ్ముని కుశల మడుగుటయు వేఁ, డిని నరపతి నిశ్వసించి ♦ డిల్లవడి కడున్. 564

గీ॥ తనయవస్థను మౌని కం♦తయును దెలిపి, నిష్కృతినిఁగోరి వేడ మౌ♦నికులచంద్రుఁ
డరసి కరుణాంతరంగుఁడై ♦యనియెనిట్లు, బ్రహ్మహత్యాభిభూతుఁడౌ♦పార్థివునకు.

శా॥ గోకర్ణంబున కేగు వేగ మచటన్ ♦ గోరాజవాహున్ హరున్
శ్రీకల్యాణకరున్ మహాబలశివున్ ♦ సేవింపు మీ బ్రహ్మహ
త్యాకాలుష్యము నాశమొందు సుఖముల్ ♦ దైవాఱు సర్వేశ్వరుం
డేకాకారముతో. నటన్ దనరు భూ♦మీశానచూడామణీ! 566

క॥ అన విని సంతుష్టుండై, మునిసెలవున్ గొని ప్రయాణ♦ము సలిపి యటకున్
జని కొల్చి మహాబలుఁ దద్ఘసత్కృప ద్విజహత్యఁ బాసి ♦ కనియెన్ ముదమున్.

వ. అంత నచ్చటఁ గొంతకాలంబు వసించి మరల సాకేతపురంబుఁ జేరి వశిష్ఠప్రసాదంబున మదయంతియందు వంశకరుండగు నొక్కపుత్రున్ బడసి రాజ్యంబుఁ దద్వశంబుఁ జేసి శివానుగ్రహంబున మోక్షంబుఁ జెందె నిట్లు మహాబలేశ్వరలింగమాహాత్మ్యంబుఁ జెప్పితి నిఁక నేమి వినఁగోరుదు రన మునులు మహాత్మా! శివరాత్రి వ్రతవిధానంబును దద్వ్రతోపాసకభక్తచరిత్రంబు నిఁక నొండు సెలవీయుమన సూతుం డలరి యిట్లనియె. 568

## —* శివవ్రతములు *—

క॥ మును విష్ణునకు మహేశ్వరుఁ, డనురాగముతోడ నీ వ్ర♦తానుక్రమ మం
తను జెప్పె హరియు నారద, మునికి నుడువ నతఁడు లోక♦మున కెఱిఁగించెన్,

వ. నేనును మద్దేశికుని యుపదేశంబు నొందినయట్లు మీకుఁ జెప్పెద.

చ॥ వినుఁడు శివార్చనం బఖిల ♦ వేళలయందును సల్పఁజెల్లు నై
నను రజనీముఖంబుల నొ♦నర్చుట యెంతయు శ్రైష్ఠ్యభాజకం
బనియును సోమవారమున ♦ నష్టమి నాశివరాత్రియందు నిం
కను బరమోత్తమం బనియు ♦ గాటముగా వచియింతుర్ సన్మునుల్! 570

క॥ పది శైవవ్రతములు సె, ప్పెదు రుత్తమమునులు భుక్తి ♦ ముక్తిప్రదముల్
ముదమున నవ్వాని నొన, ర్పఁదగున్ హితకాములైన♦వారలు పుడమిన్. 571

క॥ అష్టమిరాతిరి భోజన, మిష్టంబుగఁ జేయవలయు ♦ నెల్లరునున్ గా
లాష్టమి మానఁగవలె వి, స్పష్టముగా భోజనమును ♦ భావనమూర్తుల్! 572

క॥ సితపక్షైకాదశి నుపవి, హితముగ నన్నంబును భుజి♦యింపఁ దగదిఁకన్
సితపక్షాన్యైకాదశి, హితవుగఁ గుడుచుఁడు భజించి ♦ యీశ్వరు నిశలన్.

గీ॥ రహిని శుద్ధత్రయోదశీ♦రాత్రి శివునిఁ, గొలిచి కుడువఁగఁదగు ధర్మ♦గోప్త్రులార!
అసితపక్షంబునందైన ♦ నభవభక్త, వరులు మానఁగవలె జగ్ధి ♦ భరమనాక.

గీ॥ సోమవారంబునందెల్ల ♦ యామినులనె, శివునిఁబూజించి భుజియింపఁ♦జెల్లు నీ వ్ర
తంబులందెందు శైవులఁ♦దనదుశక్తి, కొలఁది సాపడఁజేయఁగఁ ♦ గూడు నెపుడు.

వ. ఐహికపారమార్థికశ్రేయంబుఁ గోరువార లీచరితంబుల నాచరింపవలయు నట్లు వ్రతంబు లొనర్పనివారలు దస్కరులై జనియింతురిఁకను ముక్తికి నాలుగు తెరువు లుపదేశింపఁబడియె నవ్వి వినుండు.

క॥ శివపూజ * రుద్రజపమును, శివతిథి నుపవాసమును బ్ర♦సిద్ధంబగు నా
యవిముక్తనగరి మరణము, నివి నాలుగు మోక్షధనము ♦ నిచ్చుఁ బ్రజ కిలన్

వ. ఇందు రుద్రజపంబునుగూర్చి యనధరింపుఁడు రుద్రజపంబనునది రుద్రాధ్యాయ జపాభిషేక హోమంబులను త్రయంబున కుపలక్షణంబు అద్దాన రుద్రాధ్యాయ జపంబును రుద్రాధ్యాయాభిషేకంబును రుద్రాధ్యాయహోమంబును నను నిత్తె అంగున రుద్రాధ్యాయోపాస్తిచరితంబు త్రైవిధ్యంబుగ నెసంగు. అందు బ్రత్యేకం బీవక్ష్యమాణప్రకారంబుగ నైదువిధంబులై యుత్తరోత్తరాధికంబులై యనంత ఫలంబొసంగు నవ్వియోరయుఁడు. సకృదుద్రాధ్యాయ చమకాధ్యాయంబులఁ జదువుచు నభిషేకంబొనర్చిన నది యావర్తనాభిషేకంబని చెప్పఁబడు నిది గంగా స్నానపుణ్యఫలప్రదంబు మఱియు.

* టిప్పణి—రుద్రజపము-రుద్రాధ్యాయజపము రుద్రాధ్యాయ భట్టభాస్కరభాష్యే మేరుతంత్రోక్తం శ్లో॥ రాదీర్ఘం ధారాంతతః కుర్యా । త్రోప్యచ్యతే తద్విధానకం । నమస్తేరుద్రాగ్నావిష్ణూ । ఇత్యా ధ్యాయద్వయేనచ । ఆవర్తనమితిప్రోక్తం । గంగాస్నానఫలప్రదం । ఆవర్తనాభిషేకంతు । యః కుర్యాత్ ప్రత్యహంనరః । తస్యైవ దినజం పాపం । దేహజం నాశమాప్నుయాత్ । సంధ్యావందనతః క్షీణం । తచ్చేత్ ప్రాగ్జన్మ జంభవేత్ । ఏకః పాఠోనమస్తేస్య । హ్యనువాకః పరస్యచ ఏవం భవాయ నమస్తేస్య । అగ్నా విష్ణూత దైకకం । ఇయం రుద్రీసమాఖ్యాతా । రౌద్రపాప నికృంతనీ । అనయాప్రత్యహం యస్తు కుర్యాల్లింగాభిషేచనం । జన్మజన్మకృతం పాపం । వర్షమధ్యే ప్రణశ్యతి॥ రుద్రీభిరేకా దశభి । ర్లఘురుద్రః ప్రకీర్తితః । అనేనసిక్తం యైర్లింగం । తేనపశ్యంతి భాస్కరం॥ ఏకాదశభిరేతైస్తు । మహారుద్రః ప్రకర్తితః । నిర్ధనో ధనమాప్నోతి । మహాపాతకనాశనః । అనేన విహితోహోమ । స్సోమయాశ ఫలప్రదః॥ ఏకాదశమహారుద్రై । రతిరుద్రః ప్రకీర్తితః । అతిపాప హరోయస్మాత్ । దృష్ట్వాన్యా నైవ నిష్కృతిః॥

క॥ ఆవర్తనాభిషేకం, బేవాఁడేన్ బ్రత్యహంబు ♦ నెలమి సలుపునో
యావాఁడు వాయుదురితము, లేనియునున్ గాని మఱియు ♦ నెట్టివియేనిన్.

వ. ఇఁక రుద్రాధ్యాయంబొకమాఱును జమకానువాకంబొకటియుఁ జదువుచు నభిషేకించి "భవశర్వరుద్ర పశుపత్యుగ్ర మహద్భీమేశాన శబ్దంబుల చతుర్థ్యేక వచనాంతములతో నమశ్శబ్దాంతములతోడను "భవస్య దేవస్య పత్న్యై నమః" ఇత్యాది నామాష్టకంబులతోడను బూజించి సమాప్తియందిట్లే ప్రత్యేకంబు నామాష్టకంబుతోడఁ దర్పణంబులొసంగి యివ్విధంబుగఁ బదుకొండుమాఱులు రుద్రాధ్యాయంబును జమకానువాకంబు లొక్కొక్కటియుఁ జదువుచు నభిషేకించి పూర్వోక్తప్రకారంబుగఁ బూజనంబొనర్చిన నది రుద్రియనంబడును. ఈరుద్రి రౌద్రమునైన మహాపాపంబులఁగూడ నిర్మూలించును. దీనిచే నెవఁడు శివలింగాభిషేకంబొనర్చునో యట్టివాని కెన్నిజన్మంబులపాపంబులేని పరిహృతంబు లగును ఇఁక నీ రుద్రిసమర్చన లేకాదశంబులైన అనఁగా నూటయిఱువదియొక మాఱు రుద్రాధ్యాయంబును బదునొకండుతడవలు చమకంబునుజదువుచు నభిషేకించి పూజించిన నది లఘురుద్రమనంబడును. ఈ లఘురుద్రంబున శివుని బూజించినవారలు యమునిఁజూడరు ఇఁక నీలఘురుద్రంబులు పదునొకండైన నది మహారుద్రంబగును. ఆపూజనము సోమయాగఫలప్రదంబు. అట్టి మహారుద్రంబులు పదునొకండైన నది యతిరుద్రనామక మహాసవనంబగును. అట్టిది సర్వపాపహారం బద్దానితోఁ దుల్యంబైనదిగాని యధికంబైనదిగాని వేఱొండు పూజనవ్రతంబులేదిందు సందియంబులేదు. ఇఁక నిట్లే రుద్రజపహోమంబులుగూడ నెఱుంగునది.

గీ॥ అష్టమియు సోమవారంబు ♦ నసితపక్ష, మందలి చతుర్దశియు శివ♦హర్షకరము
లందు శివరాత్రి యున్నతం♦బై యలరుట, నావ్రతంబెల్లరకు ముఖ్య♦మై తనర్చు.

—* శ్రీ శివరాత్రివ్రతవిధానము *—

వ. అందును.

గీ॥ మాఘకృష్ణచతుర్దశి ♦ మాన్యతను ద, నరు మహాశివరాత్రి సం♦జ్ఞను ధరించి
అర్ధరాత్రినివ్యాపించు♦నదియె గ్రాహ్య, మితరమగ్రాహ్యమనియెల్ల♦ రెఱుఁగవలయు.

గీ॥ ఆ మహాశివరాత్రియం ♦ దఖిలజనులు, శివసమర్చావ్రతంబును ♦ జేయవలయు
నద్ది క్రమమొప్పఁజెప్పెద ♦ నవధరింపుఁ, డీవు తత్పరమతులై ము♦నీంద్రులార!

చ॥ తెలతెలవాఱ లేచి కడుఁ ♦ దేకువతోడుత మజ్జనాదులన్
సలిపి శివాలయంబునకుఁ ♦ జక్కఁగ నేగి శివున్ బరాత్పరున్
జలనములేనియట్టి మది ♦ చందము పొందఁగఁ గొల్చి యంత జో
తల నిడి విన్నపం బిటులు ♦ దా నొనరింపవలెన్ మునీశ్వరుల్! 581

గీ॥ నీలకంఠ! మహాదేవ! ♦ నీదువ్రతముఁ, జేయఁబూనితి నీక దయ♦చేసి విఘ్న
భయముఁబోకార్చి కామాది♦ వైరిజయము, సేకురఁగఁగొనసాఁగింపు♦శ్రీమహేశ.

ఆ॥ ఇట్లు విన్నవించి♦యిరవునకేతెంచి, యర్చనాపదార్థ ♦ మంత గుడికి
సాయమందుఁజేర్చి♦స్నానముచోటను, మరలఁజేసి యంత ♦ మడినిఁగట్టి. 483

వ. విభూతి రుద్రాక్షలధరించి సాయంసంధ్యావిధుల నిర్వర్తించి,

క॥ తత్తన్మంత్రంబులతోఁ, దత్తద్వస్తువుల నొసఁగఁ♦దగు శివునకు నీ
వత్తేని నమంత్రముగా, నెత్తెఱఁగున నొసఁగఁగూడ ♦ దెఱుఁగుఁడు మదిలోన్.

క॥ శివునకు దక్షిణతలమున, వివిధార్చాద్రవ్యములను ♦ వెలయించి సువా
ద్యవిశేషములును నృత్యము, లవిహతముగఁ దనరుచుండ ♦ నర్చింపవలెన్.

క॥ దినదినముఁ బార్థివార్చన, మును జేసెడునెడల సాయ♦మున సంధ్యాదుల్
వొనరిచి పార్థివలింగము, నొనరిచి స్థాపించి పూజ ♦ నొనరింపవలెన్. 587

క॥ స్తుతినొనరించి హరుని న, ప్రతిమంబుగ నలరఁజేయ ♦ వలయును బిదపన్
వ్రతమాహాత్మ్యముఁ దా భ, క్త్యతిశయమునఁ జదువవలయు ♦ నాలింపవలెన్.

గీ॥ నాల్గుయామంబులందును♦నాల్గులింగ, ములనురచియించియాహూతి♦మొదలుగావి
సర్గమంతకుఁగొలిచియు♦త్సవములొప్ప, జాగరముసేయవలయును♦త్సాహమునను.

క॥ మఱునాఁడు వేగ స్నానము, జరిపి యభవలింగము నొగి ♦ సలిపికొలిచి సం
బరమొప్ప దోయిలొగ్గుచు, శిరసున నతిచేసి యాచ్న ♦ సేయవలె నిటుల్.

గీ॥ ఓ మహాదేవ! నీయాజ్ఞ♦నొందివ్రతము, చేసియిప్పుడు విరతిని ♦ జేయుచుంటి
నాయథాశక్తి వెలయ నొ♦నర్పఁబడిన, యీవ్రతముచేనలరి వెల♦యింపుకృపను.

గీ॥ ఇట్టులనికుసుమాంజలి ♦ నిచ్చిశివున, కెఱఁగి విధితోడ దానంబు♦లిచ్చివ్రతము
విడిచి శివభక్తులైనట్టి ♦ విప్రులకు య, తులకు నన్నంబులిడి తిన♦వలయుఁదాను.

సీ॥ ప్రథమయామమునందుఁ ♦ బార్థివలింగంబు, నిర్మించి స్థాపించి ♦ నిష్ఠమెఱయఁ
బంచమంత్రంబులఁ ♦ బంచవస్తువుల న, ర్పణఁజేసి జలధార ♦ వదలవలయు
నష్టోత్తరశతంబు ♦ నభవమంత్రంబు జ, పించి లింగంబుపైఁ ♦ బ్రీతిపూర్వ
కముగ ధారాపూర్వ♦కముగ నీరంబును, విడువఁగావలయును ♦ వేత్తలార!

గీ॥ చిత్రమగు చందనంబుఁ గు♦శేశయములు, నక్షతములైన బియ్యంబు ♦ నల్లనల్ల
నువులు గన్నేరుఁబూవులు ♦ శివున కిష్ట,నామములచేత నర్చ నొ♦నర్పవలయు.

వ. భవశర్వరుద్రపశుపత్యుగ్రమహద్భీమేశాననామంబులను శ్రీకారపూర్వంబులుగాఁ
జతుర్థ్యంతంబులుగా నుచ్చరించి శివునిఁ బూజించవలెను. 594

సీ॥ ధూపదీపము లిచ్చి ♦ తోరంపుఁబక్వాన్న, నైవేద్యములను నొ♦నర్పవలయు
బిల్వఫలార్ఘ్యంబుఁ ♦ బేర్మిమై నొసఁగి తాం, బూలంబునర్పించి ♦ మ్రొక్కవలయు
ధ్యానమాచార్యమం♦త్రజపంబును గడు ని,శ్చలమైన మనసుతో♦సలుపవలయు
నటుగానియెడలఁ బం♦చాక్షరంబులతోడ, శివుని సంతోషింపఁ ♦ జేయవలయు

గీ॥ ధేనుముద్రను జూపించి ♦ తీర్థధారఁ, దర్పణము చేసి యంతక ♦ దమనభక్తు
లైన నేవురు బాపల ♦ కన్న మొసఁగఁ, జిత్తమందు సంకల్పముఁ ♦ జేయవలయు.

క॥ పూజాఫలంబు శివునకు, నోజ మెయిన్ ధారవోసి ♦ యుత్సుకమతియై
యాజాము నుత్సవంబుల, తో జానుగఁ గడపవలయుఁ ♦ దోరంపుమతిన్.

ఆ॥ ఇఁక ద్వితీయయామ♦మే తేర సంకల్ప, మును బొనర్పవలయు ♦ ముందుగానె
నాల్గుజాలనర్చ♦నముల కేన్ సంకల్ప, మును రచించి యర్చఁ♦బూనవలయు.

క॥ పూర్వమువలె ద్రవ్యంబుల, శర్వున కర్పింప వలెను ♦ జలధారలతోఁ
బూర్వమునకన్న ద్విగుణము, సర్వేశ్వరమంత్రజపము ♦ సల్పఁగవలయున్.

క॥ తిలలును యవలును బద్మం, బులు బిల్వదళంబు లొసఁగి ♦ పురహరుఁ గొలువన్
వలెఁ బాయసనైవేద్యం, బలరించి మాదీఫలంబు ♦ నర్ఘ్య మిడవలెన్. 599

వ. ద్విగుణముగా బ్రాహ్మణభోజనమును సంకల్పించి పూజాఫలంబు శివునకర్పించి యుత్సవంబుల ద్వితీయయామంబుఁ గడపవలయు నంత తృతీయయామంబునందు యథాపూర్వంబుగ నర్పించి. 600

గీ॥ గోధుమలుఁ బుష్పములు నర్క ♦ కుసుమములును
ధూపదీపంబు లొసఁగి బం ♦ ధురసుశాక
మోదనంబును నైవేద్య ♦ మొసఁగి దాడి
మఫలమర్ఘ్యమునిడి ప్రణా ♦ మంబు సలిపి. 601

వ. పూర్వజపంబుకన్న ద్విగుణముగా మంత్రజపంబొనర్చి ద్విగుణ బ్రాహ్మణ భోజనము సంకల్పించి యామాంత ముత్సవములతోఁ గడపవలయు నిఁక నాల్గవయామంబందుఁ బూర్వంబువలెఁ బూజించి. 602

చ॥ మినుములుఁ గొఱ్ఱలున్ బెసలు ♦ మేలగు తక్కిన సప్తధాన్యముల్
గొనబగు శంఖపుష్పములుఁ ♦ గోమలబిల్వదళంబు లర్పణం
బొనరిచి మిన్నగారెలను ♦ నొప్పగు తియ్యనిభక్ష్యముల్ నివే
దన మొనరించి యంత వివి♦ధంపు ఫలంబుల నర్ఘ్యమీఁదగున్. 603

క॥ లేనియెడల మోచాఫల, మేనియునున్ దెచ్చి యర్ఘ్య ♦ మీఁదగు నిఁక మం
త్రానుష్ఠానము ద్విగుణము, గా నెఱవేర్పవలెఁ దొంటి♦కన్న మునీంద్రుల్!

వ. అట్లే ద్విగుణబ్రాహ్మణాభ్యవహారంబును సంకల్పించి నృత్యగీతవాద్యంబులతో యామంబుఁ గడపవలయును. 605

సీ॥ పరితూష్యమైన నా♦స్నానంబు నొనరించి, శివునిఁ గ్రమముగఁ బూ♦జింపవలయు
నానావిధములగు ♦ దానంబులను సర్వ, విప్రులనెఱిఁగి య♦ర్పింపవలయు
యామసంఖ్యనెఱింగి♦యతుల కగ్రజులకు, సంతర్పణంబులు ♦ సలుపవలయు
వేదఋక్ప్రశంసనంబు ♦ వెలయఁబుష్పాంజలి, నుడురాజమౌళికి ♦ నొసఁగవలయు

ఆ॥ ఛత్రచామరవ్య♦జనములొసంగి ద, ర్పణముఁజూపి శంఖ♦రవముఁజేసి
యంత వ్రతఫలంబు♦నా శివున కొసంగి, ప్రార్థనంబు సేయ♦వలయునిట్లు. 607

గీ॥ ఓ మహాదేవ! నీసేవ♦నొసఁగుమా కు, లంబులం దెల్ల నిన్నుఁద♦లంపనట్టి
కులమునం దెప్డు జన్మంబు♦వలదు నీదు, వాఁడ నీయందు నిలిపితిఁ♦బ్రాణములను.

క॥ కరుణానిధి! నీయందే, మరగించితి నెప్డు నాదు♦మనము నటులు నీ
వరసి తగినట్లుగా నే, ర్పఱుపుము జోతలఁ బొనర్తు♦బాలేందుధరా! 609

క॥ ఈ యుపవాసవ్రతమున, నేయున్నతఫలమొ దాని♦నీవే కొని య
త్యాయతమోదమునను సుఖ, దాయకుఁడవు గమ్ము నాకు♦దాక్షిణ్యనిధీ!

వ. ఇట్లు ప్రార్థించి తిలకాశీస్సుల బ్రాహ్మణులచే నొంది శివుని విసర్జింపవలె నెవ్వనిచే నిట్లు వ్రతంబు సేయఁబడునో యవ్వానికి శివుండు దవ్వుగ నుండఁడు. వాని పుణ్యంబు నెవ్వరును జెప్పలే రవ్వానికి లభింపని శ్రేయంబు లేదు. మోక్షబీజంబు వాని యఱచేతికి లభించినది. వేయియేల? సర్వవిధభుక్తిముక్తులకును శివుం డవ్వాని కొసంగఁగలఁడు. విష్ణువు మున్నగు వేల్పులెల్ల రావ్రతంబుఁ బ్రీతిమెయి నాచరించిరి. నారదుం డనేకులచే నిప్పుడమియం దాచరింపఁజేసె నీక నెద్దాని యాచరణంబునఁగాని వ్రతంబు సంపూర్ణము గానేరదో యట్టి యుద్యాపనవిధంబుఁ జెప్పెద వినుండు. 611

సీ॥ పదునాలుగేఁడులు♦పరఁగ నీశివరాత్రి, వ్రతముఁబూన్కి మెయిస♦ల్పంగవలయు
నొగి మాఘకృష్ణత్ర♦యోదశి నేకభు, క్తముఁ జతుర్దశిఁ బస్తుఁ♦గాంచవలయు
శివరాత్రిదినమున♦శివునిగుడికిఁ బోయి, స్థిరమతి శివునిఁబూ♦జింపవలయు
పిదప స్వగృహమునఁ♦బేర్మి గౌరీతిల, కమను మండలముఁ జ♦క్కఁగనమర్చ

గీ॥ వలయుఁ దన్మధ్య లింగతో♦భద్రమనెడు, మండలంబు రచించి త♦న్మండలమునఁ
బదునొకండు కలశముల♦వస్త్రఫలను, వర్ణసహితంబులను నుంచ♦వలయువినుఁడు.

వ. ఆ పదునొకండు కలశంబులలో.

గీ॥ కనకకలశంబు మధ్య నొ♦క్కండమర్చి, పలపరిమితంబొ గాకర్ధ♦పలపరిమిత
మైనబంగరుతోఁ దుహి♦నాద్రిజాశి, వప్రతిమఁగూర్చి యందుఁ జే♦ర్పఁగ వలయును.

వ. ఆచార్యఋత్విగ్వరణంబుచేసి వారలసెలవుతో శివపూజనంబు నాల్గుజాములొనర్చి జాగరణము చేయవలయును. శక్త్యనుసారము ప్రాజాపత్యేష్టినిఁ బొనర్పవలయు ననంతరము బ్రాహ్మణభోజనము చేయించి భక్తితో దానంబులీవలయును. ఆచార్యఋత్విగ్దంపతులకు వస్త్రాలంకారభూషణంబు లొసంగవలయు. మఱియు నాచార్యున కుపస్కరములతో సవత్సయగు కపిలధేనువును శివప్రీతిగనొసంగి బంగారుకలశముతోఁగూడిన శివప్రతిమను సమర్పించవలయును. అటుమీఁద దోసిలొగ్గి నమ్రుండై ప్రేమతో గద్గదాక్షరము లొప్పనిట్లు మహేశ్వరునిఁ బ్రార్థించవలయును. 613

గీ॥ దేవదేవ మహాదేవ! ♦ దేవనాథ!, భక్తవత్సల! యీనీదు ♦ వ్రతముచేతఁ
గరుణఁబఱుపుము నాయెడ ♦ గాఢభక్తి, నీదువ్రత మొనరించితి ♦ నిగమవంద్య!

క॥ తెలిసియొ తెలియకయో యె, ట్టులొ వ్రతముఁబొనర్చితిని గ ♦ డున్ గృపనాపైఁ
దలఁచి మహాత్మా! వ్రతము! స,ఫలముగ బొనరింపు రజత ♦ పర్వతనిలయా! 616

గీ॥ ఇట్లు పరమాత్ముఁడైన మ ♦ హేశ్వరునకుఁ, బ్రార్థనఁబొనర్చి యంతఁ బు ♦ ష్పాంజలినిడి
సాఁగిలంబడి జోతను ♦ సల్పవలయు, నిదియె యుద్యాపనవిధి ము ♦ నీంద్రులార! 617

వ. ఇఁకను జ్ఞానంబునఁగాక యదృచ్ఛచే శివరాత్రివ్రతంబు నొక్కించుకసల్పి కృతార్థుండైన వ్యాధుని చరిత్రంబుఁ జెప్పెద నాలకింపుఁడని యిట్లనియె. 618

## —* వ్యాధేశ్వరలింగము—వ్యాధచరిత్రము *—

క॥ కలఁ డర్బుదాచలాఁతిక, తలవని నొకభిల్లుఁ డధిక ♦ దర్పోద్ధతుఁ డు
జ్జ్వలబలుఁడు గురుద్రుహుఁడని, యలరెడువాఁ డఖిలజంతు ♦ హననపరుఁడిలన్. 

గీ॥ తల్లిదండ్రులు పెండ్లము ♦ పిల్లజెల్ల, లొప్పవాఁ డెట్టి యఘముల ♦ నొప్పవాఁడు
దొంగతనమందు మేటియై ♦ త్రోవలందు, బాటసారులఁగొట్టిద్ర ♦ వ్యములఁగొనును.

గీ॥ క్రూరుఁడై బాల్యముననుండి ♦ కొంకులేక, దోసములెచేయుసుకృతంబు ♦ త్రోవఁజనఁడు
గడచెఁ జిరకాలమిట్టు లొ ♦ క్కఁడ్డు సేర, వచ్చె శివరాత్రి బహుపుణ్య ♦ ఫలవిధాత్రి.

చ॥ గతదినమందె కానను మృ ♦ గంబులు గన్పడకుంట నాఁకటన్
వెతపడి తల్లిదండ్రులును ♦ బెండ్లముఁ బిల్లలు వేగిరింపఁగా
జతనముతోడ విల్లుగొని ♦ సాంద్రతరాటవిఁజేరి యెల్లెడన్
వెతకిన జంతువేదియు ల ♦ భింపకయుండెను బోయ కత్తఱిన్. 622

మ॥ రవి యస్తంగతుఁడయ్యె నంతనె హరి ♦ ద్రాజిన్ వెలుంగుల్ దొలం
గె విగాఢంబగు నంధకారము పరం ♦ గెన్ విశ్వమందెల్ల వ్యా
ధవరుండున్ మదిలోనఁ బల్విగిలి హా ♦ దైవంబ! యెందేని జం
తు వెదేన్ గన్పడ దిమ్మ్ కేనెటులఁబో ♦ దున్ శూన్యహస్తాలతో. 623

ఉ॥ ఆకొని సోలుచుండిరి మ♦దర్భకులున్ దలిదండ్రు లాలునున్
జేకొన కెద్దిగ్రాస మిలు ♦ సేరి యెటుల్ గనుఁగొందు వారి నిం
దే కనుచుందు జంతువు నె♦దేని నటం చొక చెర్వుచేరువం
దాకులుఁడౌచు శ్రీఫలన♦గాగ్రము నెక్కి వసించె నయ్యెడన్. 624

ఉ॥ వాఁడును నాఁకటంబడలి ♦ నచ్చునొకో యొక జంతువేని యీ
జాడకు దానిఁ జంపికొని ♦ సద్మముచేరుదునొక్కొ యంచటన్
బోడిమిఁదక్కి వెక్కసపుఁ ♦ బూన్కిగనుంగొనుచుండె నంతలోన్
లేడి యొకండు దప్పిఁగొని ♦ నీళులఁగ్రోలఁగ రా నతండునున్. 625

వ. కనుంగొని యద్దానిం జంపఁదలఁచి వేగంబుతో.

—* వ్యాధునకు శివలింగార్చన పొసగుట *—

గీ॥ కార్ముకము నెక్కు వెట్ట న♦క్కర్జమునను, దునిగిమారూరదళ మొండ♦ధోధరిత్రి
వెలయుశివలింగమునహిమ♦సలిలసిక్త, మైపడుడునాద్యయామార్చ♦యయ్యెనద్ది.

క॥ ఆయర్చాఫలమున నా, బోయకు సకలాఘములును♦బోలిసె నపుడటన్
డాయఁగవచ్చిన మృగియును, భీయొనరఁగ వాని నడిగె ♦ బిట్టున నిట్టుల్. 627

ఉ॥ ఏమియొనర్పనెంచెదవొ ♦ యిప్పుడు సెప్పు కిరాత! యన్న వాఁ
డామృగి కిట్లనెన్ మిగుల ♦ యాఁకొనియుంటిని నింటిలోన నా
పేర్మిడిబిడ్డ లాలుఁ గడు♦వృద్ధులు నాతలిదండ్రు లాఁకటన్
దీమరియుండి రిష్ట నిను ♦ దెగ్గొని చేకొనిపోదు భుక్తికై.

క॥ అన లేడి యడలి యిపుడే, యొనరించుదు? నెటకుఁబోదు?♦నుక్కులుఁ డీతం
డనికొని యాతని కిట్లనె, వనచర! నే నధికఫలముఁ ♦ బడయుదు దీనన్. 620

గీ॥ నాదుహాలసున నీకును ♦ నీదుజనము, నకును సుకమైన నేను ధ♦న్యనుగదన్న!
ఒరుల కుపకారులగువారి♦కొప్పుపుణ్య, మెన్నఁదరమానె! నూ తేండ్ల♦ కేనిఁబుడమి

గీ॥ ఐన నొకపల్కు నాదృతి♦నాలకింపు, నాదుబిడ్డలు వెంకి ను♦న్నారు వారి
నాదు చెలియలికేనియు♦నాదువిభున, కేని యర్పించి వచ్చెద♦నిపుడు విడిన. 631

క॥ కల్లలు నేఁబల్కను విను, భిల్లవరా! సత్యమిద్ది ♦ పృథివియు సంద్రం
బెల్లజలధార లెల్లను, బెల్లుగ సత్యంబుతోడ ♦ వెలయున్ గాదే! 632

ఆ॥ ఇట్లుచెప్పఁ గఱకు♦టెఱుకు నెనరులేక, వినకయున్న హరిణి ♦ విస్మయించి
బెదరి యిట్లు వట్టు♦బెట్టుకొనెఁ గిరాత! వినుము నానుడుల వి♦వేకమరసి. 633

గీ॥ వేదవిక్రేతయై సాంధ్య♦విధిని సలుప, నట్టిబాపఁడు విభునాజ్ఞ ♦ నతకరించి
మెలఁగుపొలఁతియుధర్మంబు♦మీఱునతఁడు, వడయునఘమేను బడసెద♦బాసఁదప్పి.

క॥ ఇఁకను గృతఘ్నుండును ద్ర్యం, బకభక్తివిహీనమతియు ♦ మైత్రీద్రోహుం
డకరుణుఁడు నొందుదోసము, నకుఁ జిక్కఁడు నిటకురాక ♦ నక్కిన నింటన్.

ఆ॥ ఇట్లు చాల నొల్లు♦నిడి నిల్చియున్న నా, హరిణిఁగాంచిఁ బోయఁ ♦ డరిగిరమ్ము
నాఁగ నీరు ద్రావి ♦ వేగంబుతో నద్ది, చనియెఁ బేరెమొంది ♦ సద్మమునకు.

క॥ భిల్లుఁడు నిద్దురపోకయె, యెల్లెడలన్ గాంచుచుండె ♦ నింతట మృగికిన్
జెల్లెలు వేఱొకమృగి దా, నల్లనఁ దన యప్పజాడ ♦ లరయుచు వచ్చెన్.

ఉ॥ వచ్చిన లేడిఁ గన్గొని జ♦వంబున భిల్లుఁడు వింట బాణమున్
గుచ్చుచునుండ బిల్వదళ ♦ గుచ్ఛము హైమజలార్ద్రి మీశుపైఁ
గ్రిచ్చుఱ రాల బోయ కది ♦ గ్రాలెను రెండవయామపూజయై
చెచ్చెర వానిఁగాంచి మృగి ♦ చింతిలి యేమియొనర్తు వీవనన్. 638

గీ॥ తొంటివలెవాఁడు సెప్పడుఁ ♦ దొందరేమి, యొందకిట్లనె మృగి ఫలం♦బొందెనాడు
పుట్టు ధన్య ననిత్యమీ♦పొల్లయొడలు, పరులకుపకారకంబైన ♦ భాగ్యమెంతొ.

క॥ ఐనను నా పసికూనలు, నా నెలవునఁ గలవు వారి ♦ నాథుని చేతన్
నేనిడి వచ్చెద నీసము, ఖానకు విడు మిపుడు వ్యాధ! ♦ కరుణదలిర్పన్. 640

గీ॥ నావుడును వ్యాధుఁడిట్లనె♦నమ్మనమ్మ, నీదు నుడుల వధింతు సం♦దియము లేదు
నాఁగ మృగి గడుభీతయై ♦ వేగ పాటు, తోడ నిట్టుల శపథంబు ♦ లాడఁదొడఁగె.

సీ॥ పరిణయంబాడిన ♦ పడుచును విడనాడి, పెఱనారిఁ జెందెడు ♦ బెట్టిదుండు
హరిపూజసేయుచు ♦ నమ్మహేశ్వరునిందఁ, గావించుచున్నట్టి ♦ కలుషమూర్తి
ఆమ్నాయధర్మంబు♦లవులఁబోఁ జిమ్మి క, ల్పితధర్మముల గార♦వించు మొఱకు
తలిదండ్రులమృతాహా♦ములశూన్యముగఁబుచ్చి, తాను మెక్కెడునట్టి♦దారుణాత్ముఁ

గీ॥ డొందు నిరయంబులొందెద ♦ నిందు బాస, జేసి నేనింటడాగిన ♦ సిద్ధమిద్ధి
యనుడు వనచరుఁడొడఁబడి♦యరిగిరమ్మ, పొమ్మనఁగ నీళులను గ్రోలి♦పోయె నదియు.

క॥ ఎఱుకకు నిద్దురలేకయె, జరిగెను బ్రహరద్వయంబు ♦ క్షపయందాలో
నెఱుఁగక మృగులవిలంబము, నరయుచుఁ గాసారమునకు ♦ హరిణము సేరెన్.

ఆ॥ మిగులబలిసియున్న ♦ మృగమును గన్గొని, కరముపొంగి వేట♦కాఁడు వింటఁ
దాఁడిగి బాణమేయఁ♦దొడరఁదోయదళంబు, లీశుశిరసుపైఁ బ్ర♦వేశమొందె. 644

క॥ శరరవము విని మృగము వన, చరునకు నిపుడేమిసేయ ♦ సంకల్పమనా
నెఱుకు మునుపటియటులనె, యెఱిఁగించెను దనదు హృదయ ♦ మేర్పడ నంతన్.

క॥ మృగమది బిట్టలరి తగన్, మృగయునకనెఁ గృతిని నేను ♦ మిక్కిలిపుష్టిన్
దగియుంటి మీరుగడుపా, రగఁదిని తనియుదురు వనచ♦రపరిముఖ! యిఁకన్.

ఉ॥ ఎవ్వనిచేత నెట్టఁ బరుల ♦ కే యుపకారము గల్గకున్న వాఁ
డివ్వసుధన్ వృథాజనితుఁ ♦ డెల్ల విధంబుల నెంచిచూడఁగా
నెవ్వఁడు శక్తియుక్తుఁడయి ♦ యే యుపకారము సల్పకుండునో
యన్నెడవానిశక్తి వితయా ♦ నరకంబును జెంది కుందెడున్.

వ. అన నిట్లనుఁ.

గీ॥ ఎఱుకు! విను నాదు బిడ్డల ♦ నెల్లవారి, తల్లులకు నప్పగించి యం♦దఱకుఁ జెప్పి
యరుగుదెంచుదునన భిల్లుఁ♦డబ్బరమొంది, పలికెనిట్టులమృగముతోఁ♦బరవసముగ.

ఉ॥ ఈనఱ కెన్నియో హరిణు ♦ లిట్టులె పెక్కులు నీతులాడి న
న్నీ విపినంబునం దునిచి ♦ యేగిన వొక్కటి గానరా దిఁకన్
నీవును నట్లె వచ్చి చన ♦ నేర్పు రచించితి విట్టు లందఱిన్
బోవిడ మాకు జీవనము ♦ పొందగు నెవ్విధి? వంచకాత్మకుల్ ! 649

గీ॥ అనిన మృగ మిట్టులనె వ్యాధ! ♦ యనృతమేమి, లేదు సత్యముచేత నా♦లీకజాండ
మెల్ల శోభిల్లుచున్నది ♦ యిప్పగిది న, లీకవాదికిఁ బుణ్యంబు ♦ లేదు లేదు.

వ. ఇఁకను నా ప్రతినను వినుము.

సీ॥ సూర్యాస్తమయవేళ♦సురతమొందెడువాఁడు, కూటసాక్ష్యము జెప్పి♦కొనెడువాఁడు
శివరాత్రి నన్నంబుఁ♦బవలు మెక్కెడువాఁడు, సంధ్యవార్చని విప్ర♦జాతివాఁడు
చాలియు నుపకృతి♦సల్పకుండెడువాఁడు, పరులుదాఁచినసొమ్ముఁ♦బడయువాఁడు
బైల్వదళములఁ బ♦ర్వమునఁ గోసెడువాఁడు, దెలిసి యభోజ్యంబుఁ ♦ దినెడువాఁడు

గీ॥ తనువునన్ బూది పదురాక♦లోనరనట్టి, వాఁడు శివపూజసేయక ♦ కూడుఁగుడుచు
వాఁడునున్ జెందుదురితంబుఁ♦బడయువాఁడ, మరలనీసన్నిధికిరాక♦ మసలియున్న.

క॥ శివపూజచేత దోసము, లవిసి చనుట నా నిషాదుఁ ♦ డాశంబరమున్
జవమునఁ జని రమ్మన నది, యనసథమున్ జేరెఁదాఁవి ♦ యట నుదకములన్.

గీ॥ అందఱును నందుఁజేరి వా♦రరసికొని ప, రస్పరము సత్యనిష్ఠఁ గి♦రాతుఁజేర
నిశ్చయించుకొనుడు మగ♦నికి వచించెఁ, బెద్దమృగియిట్లు ప్రేముడి♦పెంపుమెఱయ.

క॥ నినుఁగొల్పడి సుతులెట్టులు, మనెదరు మనుగడవుగాదె ♦ మాకందఱికీ
వనఘు! యిటనుండు మేనే, చనెదను ముందేను బాస ♦ సల్పినదానన్. 654

గీ॥ అనిన రెండవమృగియిట్టు♦లనియె మీర, లుండుఁడిచ్చోట బాలుర♦నోముకొనుచు
మీకు దాసినిగాదె నేఁ♦బోదువ్యాధు, కడకునను బంపుడిప్పాటు♦క్రమము మెఱయ.

క॥ అన మృగమిట్లనె నేనే, చనెదను మీరిందె యుండి ♦ సాఁకుఁడు సుతులన్
జను మాతృరక్ష బాలుర, కనవరత ప్రేమభరిత♦మై భువిలోనన్, 646

గీ॥ విభుఁడిటులులుపల్క హరిణులు♦విభుఁడు సనిన, విధవలకు జీవితంబెల్ల♦వితయగాదె
యనుచుబిడ్డలనూరార్చి♦యాముగురును, వ్యాధుకడకేగి రెంతొ స♦త్యంబుపేర్మి,

క॥ వారినిగని తచ్ఛిశువులు, వారలకేగతియొ యదియె ♦ ప్రభవిల్లెడు మా
కీరాపేటికి నని వడి, వారలనే తారసించి ♦ వచ్చెంబిఱుందన్. 658

క॥ మృగములనెల్లఁ గనుంగొని, మృగయుఁడు గడుఁబొంగి వాని♦మీఁద శరముల్
నిగిడింపగఁజాపము నెత్తఁగఁబడియెను దోయబిల్వ♦దళము శివునిపై. 659

గీ॥ దాన నాల్గవయామార్చ ♦ దనరెనిట్లు, భిల్లునకుఁగూడె శివరాత్రి ♦ వృషభకేతు
పూజయంతనెమృగములు♦బోయఁజేరి, కొనుమనఘ! బాణములమమ్ముఁ♦గూలనేసి.

వ. అనిన భిల్లుం డక్కజంబొంది నైశంబగు తమంబంతయంతరించి భాస్కరోదయం బగుచున్నట్లే స్వకీయంబగు నజ్ఞానంబంత యంతరించి విజ్ఞానంబు బొడసూపు టయుఁ దన యంతరంగంబందిట్లు వితర్కించె. 661

ఉ॥ అక్కట! యీమృగంబులు ప♦రార్థము ప్రాణములన్ దృజింపఁగా
నిక్కడికేగుదెంచె నిటు♦లెంతయు జ్ఞానములేనివైన నే
నెక్కడు జ్ఞానమొప్ప జని♦యించిన మానిసినైనఁ దిండికై
కక్కఱితిన్ వధింతు మృగ♦కాండములన్ బ్రతివాసరంబిటుల్. 663

ఆ॥ ఇప్పుడేని వలదె ♦ యివ్వాని వీక్షించి, తెలివియొంద కీఁకను ♦ దెవులు మాని
తనదు పొట్టకొఱకుఁ ♦ దనవారికొఱకునై, యొరుల ఘాతసేయ ♦ నోర్వనిఁకను.

## —* వ్యాధునకు శివుఁడు ప్రత్యక్షమై వరంబు లిచ్చుట *—

క॥ అని నిశ్చయించి మృగముల, కనియెను పొండీరు యుష్మ♦దాశ్రమమున కే
నును జనియెద నానెలవున, కనఁ జంద్రకలాపమూర్తి ♦ యటఁదోఁచి యనెన్.

క॥ సకలైశ్వర్యము లిఁకఁ దా,వక నిలయమునందు వెలయు ♦ వనచరతిలకా!
సుకముల నొందుము గడునెడ, పక నీ వంశంబు చెందు ♦ బహుతరవృద్ధిన్.

వ. మఱియు నిప్పటినుండి నీవు గుహుండను నాహ్వాయంబు ధరించి సాకేతనగరంబున కనతిదూరంబున గంగాతీరంబందునున్న శృంగిబేరపురంబందుఁజేరి యందలి నిషాదులకెల్ల నొడయండవై యుండు మందు నీయిరవునకుఁ గతిపయవత్సరంబులలో దాశరథియగు శ్రీరాముఁడు పత్నీభ్రాతృయుతుండై యేతెంచి నీకు మిత్రుండగును. నీవును నన్నిఁక నేమఱక కొలుచుచుండుము. నీకు దుర్లభంబగు మోక్షంబు నొసంగెద నన్నంత నతండు విజ్ఞానంబుఁజెంది శివునకు మ్రొక్కె నంత మృగంబులెల్ల జగదీశ్వరునిఁగాంచి మించుకూరిమి సాష్టాంగంబెఱఁగి నిలిచిన శంకరుండు వానిఁ గృపాదృష్టింగాంచి శాపానసానంబుఁగావించి దివ్యదేహంబులిచ్చి తన లోకంబున్ జేర్చె. భిల్లుఁడును సంతసిల్లి శివోక్తప్రకారం బఖిలసుఖంబులొంది శ్రీరాముని చెలిమిఁబడసి శివానుగ్రహంబున శివసాయుజ్యంబు నొందె నజ్ఞానంబున

నెఱుఁగక శివునిఁ బూజించిన బోయ కిట్టి శివసాయుజ్యంబు గలుగ నీక జ్ఞానం
బున శివార్చనచేసినవార లెట్టి తేజంబు నొందుదురో యారయఁజాలుదు రిట్లు. 666

చ॥ అనిశము సోమవారముల ♦ నష్టములందును శైవరాత్రులం
దును నిశలన్ మహేశ్వరునిఁ ♦ దోయము మించ భజించినట్టివా
రిని సురలేనిఁబోలరు మ♦ఱిన్ మఱి వారికి సర్వసంపదల్
పొనరిచి యంత్యకాలమున ♦ మోక్షమొసంగు మహేశ్వరుం డిలన్. 667

వ. అనినొడివినన్ గడుసంతసించి సూతునకు శౌనకాదిమునులు మఱియునిట్లనిరి.

క॥ మోక్షమన నెట్టిదో యఘ, మోక్షణచణసూక్తికుశల! ♦ మునినుతశీలా!
దక్షతతోఁ దెల్పుము మా, కీక్షణమున ననుడు సూతుఁ ♦ డిట్టులు పలికెన్.

సీ॥ సంసారదుఃఖభం♦జనియును నతులితా, నందదాయినియైన ♦ తనర్చు ముక్తి
సాలోక్య సారూప్య ♦ సాన్నిధ్యసంజ్ఞల, మూడువిధంబులఁ ♦ బొనరియుండు
సాయుజ్యమనెడు న♦సాధారణంబగు, ముక్తి నాల్గవదియై ♦ మురువుమీఱు
పాశుపతవ్రత ♦ ఫలమున నదిగల్గుం, నట్టి మోక్షమునకు ♦ హరుఁడె దాత

గీ॥ త్రిగుణములనొప్పు బ్రహ్మాది♦దేవనాథు, లోలి ధర్మార్థకామంబు♦లొసఁగువారు
నిర్వికారియు బ్రహ్మంబు ♦ నిర్గుణుండు, శివుఁడు తుర్యుఁడు విజ్ఞాన♦సేవ్యుఁడెందు.

వ. మఱియు నవ్వ్యయుండును సాక్షియు నద్వయుండగు నాశివుండు భక్తులకుఁ ద్రివ
ర్గంబుఁగూడనిచ్చి పరిపాకసమయంబున ముక్తినొసంగు నైదవముక్తి కైవల్య
సంజ్ఞనొప్పు నద్దానిలక్షణంబును వినుండు. 671

క॥ ఎద్దానఁ బొడమునులోకము, లెద్దానన్ వృద్ధిఁజెందు ♦ నెంతయు మఱి య
వ్వెద్దాన లయము చెందెదు, నెద్దానన్ నిండఁబడెడు ♦ నీజగమెల్లన్. 672

క॥ అద్దియె శివరూపంబని, యద్దియె కైవల్యవస్తు♦వనియు ననఘులౌ
పెద్దలు సెప్పుదు రెప్పుడు, నద్ది సకలనిష్కళాత్మ ♦ మై ద్వివిధంబౌ. 673

చ॥ ఎఱుఁగఁగలేదు దాని హరి ♦ యే నజుఁడేని షడాననాదులే
నెఱుఁగరు నారదర్షియును ♦ నించుక వ్యాసుఁడు దత్కుమారకుం
డెఱుఁగడు సర్వదేవతలు ♦ నెల్లరు మాను లెఱుంగ రింకఁ దాఁ
మెఱుఁగఁగలేవు వేదతతు ♦ లెల్లను శాస్త్రములున్ బురాణముల్. 674

క॥ సత్యము జ్ఞాన మనంతము, నత్యయరహితంబు సచ్చి ♦ దానందంబున్
మత్యతివిషయము పరమా, చిత్యజ్ఞు లెఱుంగవలయు ♦ సిద్ధము దానిన్. 675

సీ॥ నిరుపాధికంబయి ♦ నిర్గుణంబయి నిరం, జనమయి యవ్యయం ♦ బనఁగఁబరఁగి
శోణంబునున్ గాక ♦ శుద్ధముగాక హ, రిద్వర్ణమునుగాక ♦ కృష్ణవర్ణ
మునుగాక యున్నతం ♦ బునుగాక ఖర్వంబు, గాక పీనంబును ♦ గాక చిక్క
నదిగాక వాక్కులు ♦ మదియు నిరూపింపఁ, గాఁజాలనట్టి య♦నిక్కజపువస్తు

గీ॥ వాపరబ్రహ్మ మాకస♦మట్లు నెందు, వ్యాపకము మత్సరవిహీన ♦ మచ్ఛుతరము
ద్వంద్వరీతులకెపు డతీ♦తంబు పరమ, శివ సమాఖ్యకమై మేల్మి ♦ జెన్నుమీఱు.

## —* భక్తిప్రాబల్య ప్రతిపాదము *—

క॥ అట్టి పరమాత్మ మొందఁగ, గట్టి శివజ్ఞానమగును ♦ గారణ మదియుఁ
నెట్టన భక్తినొనర్చిన, నుట్టిపడును గాన భక్తి ♦ నొందఁగవలయున్. 677

గీ॥ జ్ఞానమునకన్న శివభక్తి ♦ కరముసుకర, మైనమార్గము గావున ♦ దాన శివుని
ముక్తికై భజియింపుఁడు♦మోక్షదాత, భక్త్యధీనుఁడు శర్వుఁడె♦ప్పట్లవినుఁడు.

ఆ॥ భక్తి జ్ఞానమాత ♦ భుక్తిముక్తిప్రద, సులభ దీనిచేత ♦ బలువురిలను
ముక్తిఁజెంది రిద్ది♦పొలుచు నాఱువిధంబు, లగుచుఁదెలియఁబఱతు ♦ నరయుఁడీరు.

వ. సగుణయనియు నిర్గుణయనియు నైధియనియు స్వాభావికియనియు నైష్ఠికియనియు ననైష్ఠికియనియు విభజింపఁబడియుండు నందు నైష్ఠికియొక్కం డాఱువిధముల నొప్పు ననైష్ఠికి యొక్కవిధముగానె యుండు మఱియు నీభక్తులు విహితాదిభేదములతో ననేకభేదంబుల నొప్పు వాని విస్తరించిచెప్పుటకు శక్యంబుగాదు.

సీ॥ భక్తియు జ్ఞానంబు♦పరఁగ వేర్వేరాపు, వలదు భేదముసేయ ♦ వానినెపుడు
భక్తిఁజెందకయున్న ♦ వానికి జ్ఞానంబు, గలుగనేరదు పరి ♦ ష్కారమిద్ది
భక్తునకే యెందుఁ ♦ బరిఢవిల్లును జ్ఞాన, మద్దాన శివభక్తి ♦ నందవలయు
సర్వము భక్తిచే ♦ సమకూరు సిద్ధంబు, సందియం బిట లేదు ♦ సన్మునీంద్రు

ఆ॥ లార! యీప్రకార ♦ మీరడిగినయట్లు, సెప్పినాఁడ దీనిఁ ♦ జెలఁగి వినిన
వారికెల్ల పాప ♦ వర్గంబునుండి మో, క్షంబు గలుగు సంది ♦ యంబులేదు. 681

వ. అని సూతుఁడు శౌనకాదిమహామునులకుఁ జెప్పుటయు.

గీ॥ తండ్రి! యుద్భటవంశము♦క్తాఫలాయు, మాన! జైవాతృకకిరీట♦మహిత తేజ!
లింగవైభవఖండమన్ ♦లీలనెసఁగు, కృతిఁగొనుద్వితీయమాశ్వాస♦మితవు మెఱయ.

గద్య. ఇది శ్రీ బుధజనవిధేయ ముదిగొండ నాగవీరేశ్వరనామధేయ
ప్రణీతంబైన శివపురాణంబందలి లింగవైభవఖండంబునఁ
ద్వితీయాశ్వాసము సర్వము సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



NagaRajan.



శ్రీ శివాభ్యాన్నమః

# శ్రీ శివపురాణము

## ఉమాఖండము

### ప్రథమాశ్వాసము.



శైలయాత్రికౌఘ
ప్రాశస్త్యాన్నప్రదాన ♦ భాసురతరమ
త్లేశాదిసోదరత్రయ
పేశలకమనీయకీర్తి ♦ విలసిత చరితా!

వ. అవధరింపుము శౌనకాదిమునీంద్రులు సూతున్‌గాంచి,

క॥ తెలిపితివి మున్ను కృష్ణున, కలఘుం డుపమన్యుమౌని ♦ యభవునిదీక్షన్
జెలువుగ నొసంగెనని కడుఁ, జెలిమిన్ దచ్చరిత మిందుఁ ♦ జెప్పుము సూతా!

వ. అనిన నక్కథకుండు శౌనకాదిమహామునీంద్రుల కిట్లనియె.

—* జాంబవతి పుత్త్రార్థమై శ్రీకృష్ణుని శివునిఁగూర్చి తపింపు మనుట *—

ఉ॥ మున్నొకనాఁడు జాంబవతి ♦ పుత్త్రిజనిన్ మదిఁగోరి నిండువే
డ్క న్నలినాక్షు నిట్లడిగెఁ ♦ గల్మషవర్జితుఁ గాంతవిగ్రహున్
సన్నుతశౌర్యు నొక్కసుతు ♦ సామి! భవాదృశుఁ బుట్టఁజేయు నా
కెన్నికమీఱుసంతసము ♦ హెచ్చ ననుగ్రహ మట్లొనర్పుమా!

శా॥ ముల్లోకంబుల నీకసాధ్యమయి యొ ♦ ప్పన్ జెంద దొక్కండు నీ
యుల్లంబందుఁ దలంపఁ గొత్త జగముల్ ♦ యోజింపఁగా నేర్తు ప్ర
త్ఫుల్లాంభోరుహనేత్ర! రుక్మిణికి స ♦ త్పుత్రోదయశ్రీ నుసం
ధిల్లన్ జేయఁగ శంభుమూర్తిని హిమా ♦ ద్రిన్ గొల్వలేదే విభూ!

క॥ శివువరమునఁ బ్రద్యుమ్న, ప్రవరులఁ బట్టంపుసతికిఁ ♦ బడసితివి తనూ
భవులను నిపు డట్టులె యా, భవునిఁగొలిచి నాకుఁ బుత్త్ర ♦ భాగ్యం బిమ్మా!

మ॥ అన నింతిం గని కేశవుండు మదిలో ♦ హర్షించి యెంతేని యి
ట్లనె రాణీ! యటులే యొనర్చెద మదీ♦యంబౌ ప్రియాణంబు నీ
మనమం దారయు మన్న నాసతియు క్షే♦మంబున్ శివంబున్ గడున్
బొనరన్ జేయుదు రెండు నీకు హరుఁ డం♦భోజోద్భవుండున్ రహిన్. 6

క॥ మఱి యీశులుఁ దత్సుతులును, హరిదశ్వేఁడుఁ జందురుండు♦నఖిలమునులు భా
స్వరనదులుఁ గడలి పుడమియు, నిరతము రక్షించుత్రిగాక ♦ నిను బద్మాక్షా!

గీ॥ అనుచు స్వస్తినిఁ బలికిన ♦ నాతఁ డప్పుడె, తల్లిదండ్రులకడ కేగి ♦ చల్లఁగాఁ బ
యన మెఱుఁగఁజెప్పి యవ్వారి♦యానతినిబ,లునిసెలవుఁ జెందిసతులకె♦ల్ల నువచించె.

## —* శ్రీకృష్ణుఁడు తపస్సుకై హిమగిరికి వచ్చుట *—

క॥ వారందఱి కుశలోక్తుల, చే రహిఁ గొని గరుడుఁ దలఁపఁ♦జేరి నడిగ న
వ్వారిజనయనుని హిమనగ, భూరిస్థలిఁ జేర్చి తిరుగఁ ♦ బోయె నతండున్. 9

గీ॥ అంతఁ బద్మాక్షుఁ డచ్చట♦నద్భుతంబు, దివ్యము తపస్విమండల♦భవ్య మమర
మాన్యమును బ్రాహ్మ్యలక్ష్మీస♦మావృతంబు, నైన యుపమన్యుమౌనివ♦రాశ్రమంబు.

వ. ప్రవేశించి పరమామోదమ్మున.

గీ॥ అచటి పుష్పలతలసొంపు♦నచొటిబహుళ, ఫల లలిత శాఖులయు వన♦స్పతులవిభవ
మందలి విరోధిమృగముల♦పొందికయును, నరసి యమ్మునిఁ జేరి సా♦ష్టాంగ మెఱఁగ.

క॥ ఆతండును శ్రీకృష్ణున, కాతిథ్యము నెఱపి కుశల ♦ మరయఁగఁ గృష్ణుం
డాతతమోదమున మౌనికిఁ, జేతస్పృహ నెఱుఁగఁ జేయ ♦ సిద్ధుఁ డతండున్. 12

చ॥ పడసెద పీవు నందనునిఁ ♦ బంకజలోచన! యాత్మతుల్యు నీ
యెడఁ బరమేశ్వరున్ గొలువు ♦ మిద్ధతపంబున వేడ్క మీఱ నా
తఁడు గిరిపుత్రితోఁ గపును♦దారరసప్రసరాంతరంగుఁడై
కడుకొనియున్న వాఁ డిచటఁ ♦ గాంక్షయొనర్చెద వెవ్వనిన్ గనన్. 13

ఉ॥ ఆ జగదీశు నా హరుని ♦ నా పరమేశ్వరుఁ గోరి నీవిటన్
దేజము మీఱఁగాఁ దపసుఁ ♦ దీర్చుట యెంతయు శ్రేయ మేను మున్
యోజన చేసి యాత్మమున ♦ నొప్పఁగ నిందె భజించి శంకరున్
రాజతశైలనాయకుని ♦ రాణదలిర్పఁగఁ జూచితిన్ హరీ! 14

ఆ॥ ప్రమథదేవమౌని ♦ వర్గంబు లలర నా, కిందు దరిసెనంబు ♦ నిచ్చి వరము
లిచ్చిపోయె ఘనకృ♦పేచ్ఛ మహేశ్వరుం, డట్టి పబ్బ మింక నొ♦కప్పు డగునె?

క॥ అనఁ గృష్ణుం డుపమన్యున, కనె నిట మునినాథ! శర్వు ♦ నత్యంతం బ
ర్చన నొనరిచి సిద్ధుల నొం,దిన వారలఁ దెల్పు మదికిఁ ♦ దేటపడంగన్. 16

